# కృష్ణశాస్త్రి కృతులు

బహుకాలదర్శనం

అవ్వ తిరునాళ్ళలో
తప్పిపోయింది

రిక్షావాలా

మైలురాయి

బూట్ పాలిష్

అవ్వ బస్సుప్రయాణం

ఇద్దరు సత్యవాదులు

విశ్వోదయ
ప్రచురణ

# కాటూరి వేంకటేశ్వరరావుగారికి

బావగారూ,

నేనేమి వ్రాసినా, ఏమి మాట్లాడినా వల్లమాలిన
ఇష్టంమీకు. నా రచనలన్నీ అచ్చువేయించు
మని మహ ఒత్తిడి చేసేవారు మీరు.
మీరుండగా ఆ పని చెయ్యలేకపోయాను.
ఇప్పుడు వేయిస్తున్నాను
ఇది "బహుకాలదర్శనం". మొదటిది.
మీరు దీనిని అందుకోండి, బావగారూ!
మీ గొప్పతనానికి ఇది తగినదని కాదు
ఈ శ్రేణిలో మొదటిదని! అంతే.
మీరు వెళ్ళిపోయినా, నన్నూ నా వాళ్ళనూ
వెయ్యి కళ్ళతో కనిపెడుతూ కాపాడుతూ
ఇక్కడ నాతోనే ఉంటున్నారు మీరు - నాలోనున్నూ!
బావగారూ!

హైదరాబాదు.

కృష్ణశాస్త్రి

ఈ సంపుటంలో
ప్రచురించిన రచనలన్నిటినీ
ఆకాశవాణి ప్రసారంచేసింది ;

+

# వక్తవ్యం

విశ్వోదయకు శ్రీకృష్ణశాస్త్రిగారు పరమాప్తులు. శాస్త్రిగారికి విశ్వోదయ ఆత్మబంధువు. ఈ అనుబంధం నేటిది కాదు. చిరకాలానుగత మైనది.

శ్రీశాస్త్రిగారి ప్రతిభావంతములు, అపూర్వములు అయిన రచనలు త్వరగా అచ్చయి తెలుగుదేశం నలుమూలలా వ్యాపించవలెననీ, ఆయన సాధించిన బహుముఖసారస్వత ప్రక్రియలను ఆంధ్రరసజ్ఞులు ఆస్వాదించవలెననీ, యువ రచయితలు అవి చూపిన నవ్యమార్గాలలో తమ రచనలను తీర్చి దిద్దుకోవలెననీ, విశ్వోదయ చిరకాల కాంక్ష. దేశంలోని సుస్థిర పుస్తక ప్రచురణ సంస్థలు గాని, ధనాధిక రసజ్ఞులు గాని, ఈ సాహిత్యసత్కార్యం ఏనాడో నిర్వహించవలసింది. కాని ఇంతవరకు ఆపని జరగలేదు. ఇప్పటికే కాలాతీత మయింది.

స్పర్శవేదివంటి ఆయనచేయి ఏసారస్వతశాఖపై పడినా అది సువర్ణమయమయింది. ముక్తకం, గేయం, నాటిక, యక్షగానం, సంగీతరూపకం, సాహిత్యప్రసంగం, ఆయన ప్రత్యేకముద్రతో నవజీవనాన్ని సంపాదించు కున్నాయి.

అట్టి శాస్త్రిగారి రచనలను ధారావాహిగా ఆయా రచనారీతులను బట్టి ప్రత్యేక సంపుటములుగా ప్రకటించే పనికి

యథాశక్తిగా నేడు విశ్వోదయ పూనుకున్నది; ప్రక్రియా వైవిధ్యమునుబట్టి శాస్త్రిగారి రచనలన్నీ సుమారు 14 సంపుటాలు కావచ్చునని అభిజ్ఞుల అంచనా. వాటి నన్నిటినీ కాలక్రమమున సాహిత్యప్రియులచేతు లందుంచవలె నని విశ్వోదయ సంకల్పం.

ఈ ఉద్దేశాన్ని విశ్వోదయ తెలియపరచగానే, శ్రీ శాస్త్రిగారు అత్యాదర పూర్వకమైన చిరునవ్వుతో - ఎన్నదగిన తమ రచనలన్నీ ఎదుట ఉంచారు.

నిజానికి, అందులో వేటికవే ప్రథమ గణ్యములై ప్రకటన కావలసినవి. కాని-నేటి ఆంధ్రావళి అభిరుచినిబట్టి, భావగభీరములు, కావ్యభాషా ప్రచురములు అయిన శాస్త్రి గారి కవితారచనలకంటె,

జనతా సన్నిహితములూ, వ్యవహారభాషాసరళములూ, రుచిమంతములూ, అయిన వచనరచనలను ముందు ప్రచురించి, తదుపరి పరంపరగా తక్కిన కవితా, నాటికా, గేయ సంపుటాలను తేవలెనని మా అభిలాష.

ఈ సదుద్యమానికి భావుకుల ప్రోత్సాహం విధిగా ఉంటుందని మా విశ్వాసం.

ఇట్లు
ప్రకాశకులు

# రెండు మాటలు

శ్రీకృష్ణశాస్త్రివంటి ఆరియుతేరిన (రచనా) వృద్ధ మూర్తుల రచనాసంపుటాలకు ముందు ఏవో రెండుమాటలు వ్రాయబోవడం చాపల్యంవల్ల గాని, చాతుర్యంవల్ల గాదు. అయితే ఈ ప్రయత్నం ఎందుకు? అంటే- ఆయనరచనల మీద ఉండే తెగ ఇష్టం వల్ల, అని జవాబు.

ఒకసారి శ్రీకృష్ణరాయభాషానిలయంలో జరిగిన మహాసభకు హాజరయి, శ్రీశాస్త్రిగారికారులో తిరిగివస్తూ ఆయనతో అన్నాను, -"అన్నగారూ, మీ రచనలన్నీ - రేడియోనాటికలు - ప్రసంగాలతో సహా త్వరగా అచ్చయి ఎప్పుడు వస్తాయా అని ఎదురుచూస్తున్నాం. మిమ్మల్ని 'కృష్ణపక్షం', 'ఊర్వశీప్రవాసం-' కవిగానే లోకం చాలా వరకు ఎరుగును. మీ అద్భుతమైన వివిధసారస్వత ప్రక్రియలను ఒడుపైన వచనరచనలను లోకానికి చూపి చకితం చెయ్యాలి" అని 'ఊరుకోక, 'పోనీ కొన్నిరచనలు నాకివ్వండి- నేను చక్కగా వేస్తాను.' అన్నాను.

శాస్త్రిగారు స్తిమితంగా- 'అన్నీ సిద్ధంచేశాను. త్వరగానే అచ్చవుతాయి, చూడండి' అన్నారు.

అని, సుమారు మూడేళ్ళయింది.

పుస్తకాలు అచ్చుకాలేదు.

అయితే- శాస్త్రిగారి కాలమానంలో మూడేళ్ళంటే మూడు రోజు లన్నమాట.

**II**

తర్వాత మళ్ళా కలుసుకోలేదు. తదుపరి- చాలా మార్పులు వచ్చాయి.

శాస్త్రిగారు దైవికంగా మౌని అయిపోవడం, ఆయన ఆరోగ్యం ఎన్నాళ్ళకోగాని కుదురుపడకపోవడం వగైరా—

మొన్న ఆమధ్య కలుసుకున్నప్పుడు, ఆయన బల్లమీద "బహుకాలదర్శనం" అనే రచనలసంపుటి హఠాత్తుగా కనపడేటప్పటికి, నా సంతోషానికి మేర లేకపోయింది.

ఆయన ఆ సంపుటానికి ఏ ఇతర కారణాలవల్ల ఆ పేరు పెట్టినా, వాటికోసం ఎదురుచూచే అస్మదాదులయెడల ఆ పేరు అన్వర్థం అయింది.

"బహుకాల దర్శనం" లో - ఒక ఆప్తత ఉంది. ఆపేక్ష ఉంది. ఆశ ఉంది.

బహుకాలానికి అయిన ఆ "దర్శనం" మళ్ళా అదృశ్యం కాకుండా, మా విశ్వోదయ దృఢసంకల్పంతో శాస్త్రిగారి రచనా సంపుటాలను పరంపరగా ప్రకటించడానికి పూనుకోవడం, ఏనాడో అస్మదాదుల కళ్ళల్లో మెదలిన స్వప్నానికి సుస్థిరరూపం ఇవ్వడమై, మరింత ఉల్లాసాన్ని కలిగిస్తున్నది.

ఇక్కడ ఒక ప్రశ్న—

ఏమి ?—

శాస్త్రిగారి పుస్తకాల ప్రచురణకు ఎందు కంత తహతహ ?

తెలుగుదేశం రచయితలకు, కవులకు, గొడ్డుపోయిందా ?

చేయివిసిరితే, వందమంది !

పుస్తకాలకు కరువా ?

విపణివీధిలో వేలకు వేలు.

మరి ?—

అక్కడే ఉంది విశేషం. ఈ ప్రశ్నకు సరియైన జవాబుచెబితే- శాస్త్రిగారి రచనాసారాన్ని స్పృశించినట్టే !
శాస్త్రిగారికీ, ఆంధ్రలోకానికీ ఉండే అనుబంధం విచిత్ర మైనది.

మొదట శాస్త్రిగారికి లోకం ఎంతఇష్టమో, అంత అందకుండా దూరంగా ఉండేవారు.

లోకానికి లోపల ఆయనమీద ఎంత అనురాగమో అంత విముఖంగా ఉన్నట్టు కనబడేది. క్రమంగా రెండు దశాబ్దులు కడచేటప్పటికి శాస్త్రిగారు తమ లోకాతీత కవితా గంధర్వలోకంనుంచి ప్రజల్లోకి తొంగిచూడడం ప్రారంభించారు. జనత తలయెత్తి ఆయనవైపు ఆశగా చూచింది. లోకంలోని ఎత్తులూ, పల్లాలు, విసుగులు, విలాసాలు, వలపులు, వగవులు, అందాలు, అహంకారాలు, ఆయన్ను ఎలుగెత్తి పిలిచాయి.

అన్నింటికీ ఆయన మారుపలికారు. ఆ పలుకులో నుంచి సూటిగా సూన్నృతంగా గేయాలు పరుగులెత్తాయి. ప్రసంగాలు పరిమళించాయి. యక్షగానాలు ప్రత్యక్షమైనాయి. విజ్ఞానం వినోదం సహస్రముఖాల విచ్చుకున్నాయి.

వీటిని ప్రజలకు అందించడానికి అభ్రభారతి (Radio) చేసిన సాహాయ్యం మరువరానిది.

ఇట్టి విశిష్టరచయిత రచనలను ఏకముఖంగా చేతిలో పెట్టుకుని చదివి ఆనందించకుండా సాహిత్యప్రియులు ఉపేక్ష వహించలేరు. అంతేకాదు—

ఆరచనల సంస్కారం అనన్యాదృశ మైనది. లోకం లోని కొందరు రచయితలు పురాణవిశ్వాసాలకో, నవీన వ్యామోహాలకో తాకట్టుపడి ఒకటి పురస్కరించడం వేరొకటి తిరస్కరించడం పరిపాటి.

శాస్త్రిగారు ప్రాచీన నవీన ప్రగతి వాదాల త్రివేణీ సంగమం. ఇందులో ఏ ఒక్కటీ నిర్గుణమైనదిగాని, నిర్దుష్ట మైనది గాని కాదని ఆయన తలంపు. ప్రతిభావంతుడు అన్ని టినీ చూస్తాడు. తన మార్గమేదో తాను నిశ్చయించు కుంటాడు. ఒకరి వెంటపడడం, ఒకరికి ప్రతిధ్వనిగా మారడం, అతనికి కిట్టని సంగతి. ఈ సత్యాన్నే కాళిదాసు మాళవిక-లో అన్నాడు— "సంతః పరీక్ష్య అన్యతర ద్భజంతే మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః"

చిన్ననాడు మహాకవులు పండితులు అయిన తండ్రి పెదతండ్రుల సాహచర్యం,

విద్యార్థిదశలో ఆంగ్లభాషా సాహిత్య కోవిదుడు రఘుపతి-నాయుడుగారి ఆచార్యకం, బాగా ఎదిగినపిమ్మట రామమోహనరాయల వంటి మానవతావాదుల అపార ప్రభావం, ఆయనను క్రొత్తవ్యక్తిని చేశాయి. కనుకనే ఆయన సాహిత్యంగురించి మాటలాడినా,సామ్యవాదంగురించి మాట్లా డినా ఉమర్ ఖయ్యాముగూర్చి మాట్లాడినా, ఉపనిషత్తులు

గూర్చి మాట్లాడినా, ఒక విలక్షణవాక్కు ఖంగున మ్రోగు తుంది.

ఒకకొందరికి వలె ఆయన రచనకు లోకంలో అస్పృశ్యము లంటూ ఏవీ లేవు, 'శక్తి అంటూ ఉండాలిగాని, రచయితకు ఉదారం, నీచంఅనీ, రమ్యం జుగుప్సిత మనీ, ఏదీ లేదు. అన్నీ ప్రతిభాపింఛికతో స్పృశిస్తే మనోహరం అయిపోతాయి.' అని ఆయన మతమూ, అనుభవమూను.

కనుకనే ఆయన 'పుష్పలావికలు' గురించి ఎంత శ్రద్ధగా చెప్పగలరో, 'బూట్ పాలిష్' గురించికూడా అంత ఇంపుగాను చెప్పగలరు. శ్రీనాథుని కవితారహస్యాలలోకి చొచ్చుకుపోయి చూచినట్లే, చిన్నారిపాపల ఆటలపాటల్లో కూడా లీనమైపోగలరు. కాబట్టి, ఆయన నోటివెంట ఏది వచ్చినా ఎవరో ప్రేరణచేస్తే వచ్చినట్టుకాక, హృదయంనుంచి దూసుకు వచ్చినట్టు కనపడుతుంది.

ఇంకో విశేష మేమంటే,

కొందరు రచయితలు ఏదో ఒక రచనాప్రక్రియను అవలంబించి, కృతార్థు లవుతారు. మరి కొందరు కొన్నిటిని అభిమానించి, మరికొన్నిటిని ప్రయోగాత్మకంగా వ్రాస్తారు. అవి సఫలం కావచ్చు. విఫలం కావచ్చు. నమ్మకం లేదు.

శాస్త్రిగారివిషయంలో మొదట అట్లాగే అనుకున్నాం; ఆయనదుర్గం కవితమాత్రమే అనీ, ఇంకేదీ ఆయన వల్లకాదనీ, కాని - ఆయన కవితను మించిన వచనమూ, యక్షగానాలూ, నాటికలూ వ్రాసి, లోకాన్ని దిగ్భ్రాంతం చేశారు. కథ,

నవలజోలికి పోలేదు. ఆయన రుచే వాటిమీదకు ప్రసరించ లేదేమో.

ఉత్తమరచయితకు ప్రతిభ, వ్యుత్పత్తి సమృద్ధిగా ఉండా లంటారు. కాని, శాస్త్రిగారికి వ్యుత్పత్తికంటె ప్రతిభమీదనే పక్షపాతం. అట్లాఅని-ఆయన వ్యుత్పత్తిని తిరస్కరించిన సన్ని వేశాలు చెప్పదగినంతగా కనపడవు. లోకంలో లబ్ధప్రతిష్ఠు లైన కవులకంటె ఆయన వాడిన అపశబ్దాలు తక్కువే.

ఏతావాతా—

ఆధునికాంధ్రసాహిత్యంలో అసాధారణ ప్రతిభావంతు డైన రచయిత శ్రీ కృష్ణశాస్త్రి. అట్టివారి రచనలు లోకానికి త్వరగా సమగ్రంగా అందాలి. ఆప్రయత్నంలో సంకీర్ణ వ్యాసాలు, సాహిత్యప్రసంగాలు, యక్షగానాలు, శ్రవ్య నాటికలు, గేయాలు, ఖండకావ్యాలు, క్రమంగా ప్రకటితం కావడం ఆంధ్ర సాహిత్యప్రియులకు ఎంతైనా హర్షదాయక మనుకుంటాను. ఈ విశ్వోదయప్రయత్నానికి ప్రజామోదం ఉంటుందని నా విశ్వాసం.

కావలికళాశాల.
1-10-65

ఇట్లు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

# నాకుతోచిన నాలుగుమాటలు

శాస్త్రిగారు ఈ సంకలనాలకి - అందులో ఇది మొదటిది, తరవాత ఎన్నో వొస్తున్నాయి - నన్ను పరిచయ వాక్యాలు రాయమన్నారు. నేను ఆయన్నిగాని, ఆయన రచనలను గాని పరిచయం చెయ్యడమనేది బొత్తిగా అపసవ్యం, అసందర్భమున్నూ, నన్నాయన పరిచయం చెయ్యడం సబబు గాని, ఆయన్నిగురించి తెలుగువారికి తెలియనిదీ, నేనే చెప్పగలిగిందీ, ఏముంటుంది ?

అంచేత ఈ నాలుగు మాటలూ మీరు చదవకపోయినా నష్టం లేదు. చదివితే చిన్నలాభం ఉండొచ్చు. ఆయన తెలుగు ఎంత రుచిగా ఉంటుందో, నా మాటల చప్పదనం చవిచూశాక మరింత బాగా తెలుస్తుంది మీకు.

నామీదున్న అభిమానంకొద్దీ ఆయన నన్ను రాయమన్నారు. అంచేత ఏదో రాయడం తప్ప గత్యంతరం లేదు.

అసలు శాస్త్రిగారి రచనలన్నీ - గద్య రచనలూ పద్యరచనలూ - పుస్తకరూపంలో వొచ్చితీరాలని పట్టుబట్టింది కాటూరి వేంకటేశ్వర రావుగారు. ఏడెనిమిదేండ్ల క్రితం, ట్రంకుపెట్లలోంచి పాత కట్టలు విప్పడం, అవన్నీ చదివి, 'బావగారే' (వేంకటేశ్వరరావుగారే) సంస్కరించి, సంపుటాలుగా విడదీసి, అచ్చు వేయించాలని శాస్త్రిగారనడం

నే నెరుగుదును. వేంకటేశ్వర్రావుగారు కొన్ని వ్యాసాలు - "కోవెల : కొలను" వంటివి - మళ్ళీమళ్ళీ విని, "వీటిని సంస్కరించడ మేమిటి బావగారూ ! రాసినవి రాసినట్టు అచ్చువేసి పారెయ్యక" అనడం; శాస్త్రిగారు, 'అలా కాదు, ఇందులో చెత్తా చెదారం, ధూళీ దూగరా - అంతా నిర్మొహమాటంగా లాగిపారేసి, నిగ్గుమాత్రమే అచ్చువేయించాలి ఆపని మీమీదపెట్టాను.' అనడంకూడా నే నెరుగుదును. దురదృష్టవశాత్తూ అకస్మాత్తుగా వేంకటేశ్వర్రావుగారు మనకి దూరమైపోయారు. ఈరచనల ప్రచురణ ఆయన ద్వారా జరిగితే ఎంతో బాగుండేది.

ఒకటి మాత్రం నిజం. ఆయన బలవంతం చెయ్యకపోతే శాస్త్రిగారు ఈ పని తలపెట్టేవారే కారు. అంచేత ఈ పుస్తకాలు అవతరించడానికి ఆయనే కారణం అని చెప్పాలి.

ఓమాటు, ఈ సందర్భంలోనే, ఒక వ్యాసం, "కోవెల : కొలను" అనుకుంటాను, నేను చదవడం వేంకటేశ్వర్రావుగారు వినడం జరిగింది. "అబ్బ ! వచనం కూడా ఏంచెక్కుతారండీ ఈయన !" అన్నాను నేను. "పెర్‌ఫెక్‌ష నిష్టామరి!" అన్నారు వేంకటేశ్వర్రావుగారు. శాస్త్రిగారి రచనాశిల్పానికి అది మంచి నిర్వచనంగానే తోస్తుందినాకు.

శాస్త్రిగారు తన తెలుగును చెక్కుతారు, దానికి నగిషీపడతారు, మెరుగు పెడతారు. పద్యంలోనూ గద్యంలోనూ కూడా ఆయన అభిరుచి మహా సున్నితమైనది. ఆయన మనస్సులో ఎక్కడో అసలైన తెలుగు భాషకు నమూనా ఏదోఉంది. ఆయన రచనలన్నీ దానికి దగ్గరగా ఉండాలి. నన్నయనాటించి నేటివరకూగల తెలుగు సాహిత్యానికి రంగూ రుచీ

కల్పించిన తెలుగు నుడికారమేకాక, నిత్యం తెలుగు ఇళ్ళలో వినబడే ప్రాణమున్న తెలుగులో మెలకవలూ అందచందాలూ అన్నీ కలిసి, ఆయన పలుకులో నిగ్గుదేరి, పద్యంగానో, పాటగానో, వచనంగానో రూపు దాలుస్తాయి.

తెలుగువారిలో చాలామంది శాస్త్రిగారిని కవిగానే ఎరుగుదురు; ముప్ఫయ్యేళ్ల క్రితం ఆయన రాసిన 'కృష్ణపక్షం' 'ఊర్వసి' 'ప్రవాసం' ద్వారా, కన్నీటి కెరటాల వెన్నెల్లో కంటక కిరీటధారియై కాళరాత్రి మధ్య తిరిగే నిస్పృహకు అవరావతారమే కృష్ణశాస్త్రి అనీ, కేవలం ఊహా సుందరి అయిన ఊర్వశిని ఆరాధించే ప్రేమికుడు కృష్ణశాస్త్రి అనీ, వాళ్ళవాళ్ళ మనస్సుల్లో ఆయన బొమ్మని ఈ రకంగా కట్టుకున్నారు ఎంతో మంది.

ఈ మధ్య ఏడెనిమిదేళ్ళగా ఆయన అతికులాసా అయిన చిన్న పిల్లల అల్లరి చిల్లరి పాటలూ, కొంటెపదాలూ, పల్లెవాళ్ళ పాటలూ, కుప్ప నూర్పు పాటలూ, రోడ్‌రోలర్ పాటలూ, బందీవాళ్ళ పాటలూ, స్త్రీల పాటలూ వంటివి రాసి రేడియో ద్వారా ప్రసారం చేస్తుంటే ఆ బొమ్మకి కొంచెం దెబ్బతగిలి, కొందరు నిజంగానే బాధ పడ్డారు. అయితే కృష్ణశాస్త్రిలో కృష్ణపక్షం రాసిన కవి ఒక మూల ఉన్నాడు. మరొక మూల లోకొన్ని బాగా దగ్గరగా ఎరుగున్న గడసరీ, మనుషుల్ని– అన్ని రకాలవాళ్ళనీ – కొంటె చిరునవ్వుతో పరిశీలిస్తూ, వాళ్ళంటే పిచ్చి ఇష్టంతో పడిచచ్చే సంఘజీవీ, ఉన్నాడు. అప్పుడూ ఇప్పుడూ కూడా ఈ రెండోవ్యక్తే బలవంతుడు.

ఇప్పుడేం జరిగిందంటే, ఆ కవిన్నీ ఈలోకజ్ఞుడున్నూ కలిసి ఒక టయ్యారు. మొదటినించీ అవుతూనేవొచ్చారేమో.

ఆ సంయోగం ఇప్పుడు పూర్తయింది. ఈ ఖండికల్లో, వ్యాసాల్లో, తా నెరుగున్న లోకాన్ని తరిచి వడపోసిన ద్రష్టా, ఆ లోకజ్ఞతకు కావ్య రూపం కల్పించిన గడసరీ. ఇద్దరూ కనిపిస్తారు. కలిసిపోయి ఒకే వ్యక్తిలా, మూర్తిలా, కనిపిస్తారు.

శాస్త్రిగారి వచన రచనల్లో సున్నితమైన హాస్యముంది. ఆ హాస్యానికి వెనక ఒక బరువూ ఉంది. నవ్వుతూ చదువుతాం, దిగులుగా నెమరు వేసుకుంటాం. 'శ్రీరాములు,' 'రిక్షావాలా,' అందరికన్నా 'సుబ్బమ్మవ్వ' ఒకసారి పరిచయమయాక, ఇంక మన్ని వొదిలిపెట్టరు. ముఖ్యంగా సుబ్బమ్మవ్వ.

"సుబ్బమ్మవ్వ" విషయంలో మరీ దిగులుగా ఉంటుంది నాకు. ఎందుకంటే, సుబ్బమ్మవ్వ అంతరించిపోతోంది. ముందు ముందు ఆమె ఉండడానికి వీల్లేదు. ఆమె సర్వతోముఖవికాసానికి అవసరమైన ఆ పల్లెటూరి చాదస్తపు బ్రాహ్మణీకం, ఆ సమిష్టి కుటుంబం ఇప్పుడే లేవు. రోజులు మారిపోతున్నాయి. మనకి ఇష్టమైనవి ఎన్నో పోతున్నాయి. "మా ఊరు పోయింది," "మా ఊళ్ళో వీధి అరుగు,'' ''కోవెల : కొలను,'' లాంటి వ్యాసాలు చదువుతుంటే 'అయ్యో!' అనిపిస్తుంది. మరి కాస్త వెనక్కిపోతే, ప్రబంధయుగమునాటివీ, ప్రభువులనాటివీ ''పుష్పలావికలూ," "సువాసన ద్రవ్యాలూ," దర్బారులూ, పండిత సత్కారాలూ, పల్లకీలు, ఏనుగులు, ఊరేగింపులు, అన్నీ ఏనాడో పోయి

నాయి. తాను ఎరుగున్న రాజాస్థానాలూ, తాను చదివిన ప్రబంధాల్లోని సూచనలూ ఆధారంగా శాస్త్రిగారు ప్రబంధకాలంనాటి వాతావరణాన్ని పునస్సృష్టించారు కొన్నిరేడియో ప్రసంగాల్లో. నిన్నమొన్న జరిగినంత స్పష్టంగా చిత్రించారు. నిజంగా ఆ రోజుల్లో ఆయన వర్ణించినట్టుండేదో లేదోగాని, చదువుతుంటే మాత్రం ఇప్పుడు లేదని దిగులుపుడుతుంది.

అయితే, 'అయ్యో, మంచివన్నీ పోతున్నాయి, కొత్తగా వొచ్చినవన్నీ చెడ్డవి, లోకం అంతకంతకి చెడిపోతోంది,' అని వాపోయే సనాతనుడు కాడు శాస్త్రిగారు. ఒక ప్రసంగంలో ఆయన అననే అన్నారు. ''మా అమ్మ పోయిందన్న విచారం నాకుండడం సహజం. అయితే మా అమ్మ పోవడం కూడా సహజమే. వెనకటివన్నీ మంచివీ, ఇప్పటివన్నీ చెడ్డవీ, అనుకోడం పొరబాటు. వెనకటివాటిలో జీవం ఉన్నవి తప్పకండా నిలబడతాయి. జీవం ఉన్నవిగనకే కొత్తవి పుట్టుకొస్తున్నాయి. కవికి పాతవీ కొత్తవీ అంటూలేవు. జీవం ఉన్న అన్నింటితోనూ అతనికి సంబంధం ఉంది. పాతవాటితోటీ, కొత్తవాటితోటీ కూడా'' అని.

పోయిన 'మా ఊరంటే' ఎంత ఇష్టమో, కొత్త నాగరికతకు చిహ్నంగా వొచ్చిన రిక్షావాలా అహమ్మదన్నా శాస్త్రిగారికి అంత ఇష్టమూను.

నాకుమట్టుకు 'ఇద్దరు సత్యవాదు' లంటే మహాచెడ్డ ఇష్టం.

1938 లో మొట్టమొదట ఆయన నాకు పరిచయమయారు. అప్పటినించీ అంటుండేవాణ్ణి, ''శాస్త్రిగారూ ! వేదికమీద మీ ప్రసంగాలూ, ఇష్టా

గోష్ఠిలో మీ సంభాషణా, ఎవరైనా రాసిపెట్టేవాడుండిఉంటే, అపురూపమైన వచన సాహిత్యం తయారయేది, తెలుగులో" అని.

అవన్నీ గాలికిపోవడం తెలుగు సాహిత్యపు దురదృష్టమని నా గట్టినమ్మకం.

ఆధోరణికి బెత్తెడు అటూఇటూగా వొచ్చినవి, అప్పుడప్పుడు ఆయన ప్రసారం చేసిన రేడియో ప్రసంగాల్లో కొన్ని ఉన్నాయి. అవి కొన్ని ఇందులో ఉన్నాయి. మరికొన్ని తరవాతి సంపుటాల్లో వొస్తున్నాయి. అంతమాత్రమైనా మనం అదృష్టవంతులం.

అసలు ఆకాశవాణే అవతరించకపోతే, తెలుగు సాహిత్యం ఇంత సంపన్నం అయే అవకాశమే ఉండేది కాదనిపిస్తుంది నాకు. శాస్త్రిగారిని కదిపింది, రేకెత్తించింది, కూర్చో బెట్టింది, మొహమాట పెట్టింది, బలవంతంగా ఆయనలోంచి అమృతగుళికలు ఇవతలికి లాగింది, ఆకాశవాణి. అంచేత తెలుగు సాహిత్యలోకం ఆకాశవాణికి ఎంతో ఋణపడిఉంది.

కబుర్లు చెప్పడంలో ఉన్నంత సరదా, కవిత్వం చెప్పడంలో లేదు శాస్త్రిగారికి. కాగితంమీద కలం పెట్టడమంటే మహబద్ధకం. ఆయన చెబుతుంటే ఇంకొకరెవరో రాయవలిసిందే. అలా తయారైనవే రేడియో ప్రసంగాలూ, నాటకాలూను.

ఇంక పాటలు రాయడం ఒక యజ్ఞమే. రజని పాడుతూనన్నా కూచోవాలి, విశ్వనాధం వీణన్నా వాయిస్తుండాలి. అనసూయా సీతా అలాగ సంగీతం వినిపిస్తూనేనా ఉండాలి. పాట రావడానికి పదినిమిషాలు

మొదలు పదిరోజులవరకూ పట్టొచ్చు. అంత సేపూ ఆ సంగీతం ఆయన చెవిమీద పడుతూనే ఉండాలి. "ఆ విరుపు బావుంది. సరిగ్గా అందులో ఇమిడే మాట ఎక్కడోఉంది వొస్తుంది, తొందరపడకు," అనే వారాయన. పాటెక్కడన్నా నట్టితే. నిజంగానే వొచ్చేది ఆమాట. వొచ్చినతరవాత పడ్డశ్రమ ఫలించింది అనిపించేది అందరికీ.

రేడియోకి రాసినా, సినీమాకి రాసినా ఆయన పాటలు సాహిత్యంలో శాశ్వతంగా నిలిచిపోతాయి. "రావమ్మా! రావమ్మా!" "పోయిరావే తల్లీ!" ఇదేమిటి అవేమిటి - 'శర్మిష్ఠ' మొదలుకుని నిన్నమొన్న రాసిన 'ఏడాది పొడుగునా' 'వేణుకుంజం' దాకా ఎన్నెన్ని పాటలు రాశారాయన?

మెత్తని, నోట్లో కరిగిపోయే తేలిక పదాలతోనే గుండెను పట్టుకు పిండే బరువూ బాధా, కలకల్లాడుతూ మనస్సుని గంతువేయించే సరదా కులాసా ఎలాగ నింపగలరో ఆయన ఆ పాటల్లో!

ఆయన రేడియో నాటకాల్లో ఎక్కువ భాగం, పాటలచుట్టూ, పాటలకోసం, అల్లినట్టు అనిపిస్తుందినాకు. అంటే మొత్తం ఇతివృత్తాన్ని పాటల్లో ఆలోచించి, మధ్య మధ్య వచనంతో పూరించినట్టు. మన ఆధునిక సాహిత్య ప్రక్రియలలో చాల భాగం ఇతర సాహిత్యాల్లో ఉన్న స్వరూపాలకు అనుకరణలు; కథానిక, నాటకం, నాటిక అన్నీ. ముఖ్యంగా రేడియోనాటిక. ఒక్క శాస్త్రిగారి రేడియోనాటికలే తెలుగులో పుట్టి తెలుగులో పెరిగినట్టు అనిపిస్తాయి. రేడియోప్రసారంలో ఉన్న అవకాశాలూ, ఇబ్బందులూ, అన్నీ జీర్ణంచేసుకుని, తనధోరణికి అనువైన ఒక స్వరూపాన్ని ఆయన సొంతంగా తయారు చేసుకొన్నారు. ఇది

అందరికీ సరిపడే నమూనా కాకపోయినా, స్వతంత్ర మైనదీ, తన కాళ్ళ మీద తనునిలబడ గలిగినదీ. ఇవి రేడియో నాటికలైనా. వీటికి సాహిత్యంలో ప్రముఖ స్థానం ఉంది.

ఈ నాటకాలూ, నాటికలూ, పాటలూ, పద్యాలూ, అన్నీ ఈ సంపుటాల్లో వొస్తున్నాయి. ఏనాడో ఇవన్నీ పుస్తకరూపంలో రావలసినవి. ఈ నాటికైనా వొస్తున్నాయని నాకు సంతృప్తి. ఆయన రాసిన ప్రతి అక్షరం వీటిలో అచ్చుపడాలని నాపట్టుదల, నా ఆశకూడ.

మద్రాసు,<br>25-2-64

పద్మరాజు.



# బహుకాల దర్శనం

[బెజవాడ రైల్వేస్టేషను ప్లాట్ ఫారం. దానికి సంబంధించిన కలకలం. దూరాన్నుంచి ఒకగొంతు "బహుకాలదర్శనం, బహుకాలదర్శనం" అంటుంది.]

వీరయ్య

అరేయ్ వెంకన్నా, సామాను తీయించి కార్లో పెట్టించు.

వెంకన్న

చిత్తం, వీరయ్యాబాబూ.

వీరయ్య

ముందు గవర్నర్ పేట పోనియ్యింటికి. కాస్త స్నానంచేసి, వాళ్ల మరమ్మత్తు చేసుకుని మరీ వెడతా కోర్టుకి.

వెంకన్న

నిద్దరలేనట్టున్నారు. ఫస్టుక్లాసు దొరకలేదేఁవిటి ?

వీరయ్య

ఫస్టుక్లాసు లేదు సరిగదా హార్డ్ సంతక్లాసులో ఓ షావుకారు పక్కన పడ్డాను. పాపం, రాత్రంతా నామీద యిష్టంకొద్దీ, నామీదే వొరిగి పడుకున్నాడు. ఆ చెమటా, అతనూ, యిటువైపు చెయ్యి కొట్టిపారేసుకోవాలనిపిస్తుంది.

శ్రీరాములు

బహుకాలదర్శనం! బహుకాలదర్శనం! ఆఁ, యేఁవిటీ? యెన్నాళ్ళకూ యెన్నాళ్ళకూ! యెప్పటిమాటో! నిన్నా మొన్నా సంగతా? సరి సారి. వీరయ్యగారూ అలా చూస్తారేవిఁటి ? నేనిట్టే పోల్చుకున్నాను మిమ్మల్ని. వయస్సు ముదిరినా, తేజస్సు యెక్కడికిపోతుందీ? యెన్నేళ్ళొచ్చినా ఆ నేవళం చూడండి. ఆఁ, యింకా పోల్చుకోలేదు నన్ను. [నవ్వుతాడు]

వీరయ్య

యెక్కడ కలుసుకున్నామండి మనం ?

శ్రీరాములు

చివరికి అంతవరకూ వచ్చింది యీ శ్రీరాములుగాడి గతి. వీరయ్యగారే పోల్చుకోలేకపోయారన్నమాట. నాన్నగారి నడగండి, పేరూ...అవీ....

వీరయ్య

నాన్నగారి పేరు శరభయ్యగారు.

శ్రీరాములు

[నవ్వుతాడు] సరి సారి. నాపేరు నాన్నగారికి చెప్పమంటున్నా గానీ, నాన్నగారి పేరు నాకు చెబుతున్నారా? రేపు నాపేరే నాకు గ్యాపకం చేస్తారు.

వీరయ్య

నాన్నగారి నెలా యెరుగుదురు? నాన్ కో ఆపరేషన్ రోజుల్లోనా?

శ్రీరాములు

రండీ, అలా దారికి రండీ. ఆయన్నెరగనివాళ్లు అఖండాంధ్రలో లేరు. ఇహ నా సంగతా? ఆయనా, నేనూ కలిసి...

వీరయ్య

కడలూరు జైల్లో వుండేవారా?

శ్రీరాములు

వూరికే వుండడం కాదు. ఒఖ్ఖ నిమిషం వదలకండా రామలక్ష్మణుల్లాగ, జంటనగరాల్లాగ వుండేవాళ్ళం. జైల్లో రోజూ నేను వండడం, ఆయన తర్వాతి పనీ.

వీరయ్య

[కొంచెం నవ్వుతూ] అంటే తినడం అనా?

శ్రీరాములు

అదిమాత్రం తక్కువనా? 'రామయమంత్రి భోజన పరాక్రమం' అని వూరికే అనేశాడా మహాకవి. అయినా నేనన్నదాని కదా అర్థం వీరయ్యబాబూ. ఆయన్ని కింద అడుగెట్టనిచ్చే వాణ్ణా అని! 'రాజ సింహుని కంఠాన ప్రాణముండ' అన్నట్టు, నేను బతికుండగా ఆయన్ని వేలెత్త నిచ్చేవాణ్ణా? నో, న్నో! జైల్లో భోజనం అయాక, నేనేదేనా గ్రంథం చదవడం, ఆయన హాయిగా కళ్ళు మూసుకుని వింటున్నట్లు...

వీరయ్య

[నవ్వుతూ] నిద్రపోవడం పూనా? శ్రమంతా మీదందురూ యెప్పుడూ.

శ్రీరాములు

ఆఁ తప్పకండా. శ్రమంతా ఈ శ్రీరాములుదీ, సౌఖ్యమంతా శరభయ్యన్నది. వై నాట్? ఏంచేతకాదు? కాని, వీరయ్యబాబూ! నువ్వో [కొంచెం నవ్వి] నువ్వనేస్తున్నా, నాన్నగారు గ్యాపకం వచ్చి. అనేసేస్తున్నా...

వీరయ్య

అనండి. నన్నలాగే అనండి.

శ్రీరాములు

ఆ అనేస్తా. అన్నా? అన్నా అంటాను. అలాగే అనేవాణ్ణి ఆరోజుల్లో. అప్పుడింతకంటే చిన్నవాడివి మరీ.

వీరయ్య

[నవ్వుతూ] అవును. ఇదివరకింతకంటే చిన్నవాణ్ణయుంటానను కుంటాను.

శ్రీరాములు

అలా అనకండేం? అది అస్తమానమూ అందరి విషయంలో నైటు కాదు. కొందరు మొదట పెద్దవాళ్లయి, క్రమక్రమంగా పసివాళ్ళయి పోతారు. వీళ్లు హారతికర్పూరం బాపతు. మరికొందరు మొదట చిన్నవాళ్లగా వుండి, దరిమిలాని ఉవ్వెత్తుగా పెరిగిపోతారు. వీళ్ళు ఆయకుడుం బాపతు. ఇహ కొందరు చప్పగా అణిగున్నట్టుండి, గాలిపోసుకుని గుండ్రంగా లావుగా పెరిగిపోతారు. వీళ్లన్నారే. వీళ్ళు రబ్బరు బెలూను తాలూకు. నువ్వో, రాజా బహద్దర్, నాన్నగారిలాగ. అప్పుడూ, యిప్పుడూ, యెప్పుడూ పెద్దవాడివే. కనక వీరయ్యబాబూ! నువ్వెప్పుడూ థర్డుక్లాసులో ప్రయాణం చెయ్యకేం? అజ్ఞాసి నేను సహించలేను.

వీరయ్య

ఏం జెయ్యమండి? ఒహప్పుడూ...

శ్రీరాములు

వొహప్పుడూ లేదు, గిహప్పుడూ లేదు, ఒప్పుకోను నేనంతే. నా చేతిలో చెయ్యి వెయ్యి. 'వొత్తు, థర్డుక్లాసులో ప్రయాణం చెయ్యను' అని. కావలిస్తే స్పెషల్ ట్రెయిన్ వేయించుకో. నేను ఎత్తుకు తిప్పిన

మా శరభయ్యన్నయ్య కొడుకు మీద, హయ్యొయ్యో, మలపగేదె వాహడు చింతపండు బస్తాలా మీద వాగగనా? పీల్లేదు.

వీరయ్య

[నవ్వి] ఫరవాలేదులెండి, ఏం జెయ్యం?

శ్రీరాములు

అదీ నిజమే మరీ. వెనక నేనూ, నాభార్యా యిలాగే ప్రయాణం చేస్తున్నాం. కాళ్ళసవారీవాళ్ళం కనక థర్డుక్లాసులో. భార్యాభర్త లెక్కారు యిద్దరు. వాళ్ళ చుట్టుకొలత ఎక్కువ. అంటే వాకరిచుట్టూ వొకరు నడిస్తే వాళ్ళకానాటికి వ్యాయామం సరిపోతుంది. రైలు కొంచెం కదలడం వేమిటి, ఆ వూపుకి భర్త నా వొళ్లోనూ, భార్య మా ఆవిడ వొళ్లోనుస్నూ గారాంగా పడుకుని నిద్రపోయారు. మాకు చంటిపిల్ల లేని సరదా తీరింది. అయితే వుదయాన్నే రైలు దిగడం మాత్రం కష్టం అయింది, వొళ్ళు మాలీసు లేకండా. అది మా ఖర్మం. నీ రేమయ్యా? మహారాజువు! అది సరేగాని, నీకెందరు పిల్లలు వీరయ్యబాబూ!

వీరయ్య

ఒక పిల్లవాడు, ఒక పిల్ల.

శ్రీరాములు

పేర్లేఁవిటి?

వీరయ్య

అమ్మాయిపేరు ఝాన్సీ.

శ్రీరాములు

భేష్. వీరనారి పేరు పెట్టావు. అబ్బాయిపేరు? తాంతియా తోపీ యేనా లేక నాన్నగారి పేరుపెట్టావా? చూడాలయ్యా నీ పిల్లల్ని వోసారి.

వీరయ్య

రండి. నాతో మా యింటికి.

శ్రీరాములు

రానూవద్దును: అయితే తొందరగా రాజమండ్రీ వెళ్లాలి. నా టిక్కట్టూ, సామానుతో సహా, మా కేశవులు—మా బావమరిదిగారిండి— ముందుగా ట్రెయినెక్కేశాడు. అది కదిలింది, నేనిలా వుండిపోయాను.

వీరయ్య

అయ్యో! నేను మీకు రాజమండ్రీ టిక్కట్టు తెప్పించనా? చూడు, వెంకన్నా నువ్వువెళ్లి... అలా ఆలోచిస్తారెందుకూ?

శ్రీరాములు

అఁహ! రాజమండ్రిలో దిగనా, తిన్నగా వార్తేరుకే పోనా అని.

వీరయ్య

పోనీ మీరేఁవనుకోపోతే ఈ పదిహేనురూపాయలు దగ్గిరుంచండి. నాన్నగారివంటివారు కదా.

శ్రీరాములు

అ...లా...గే...మ...రీ.

వీరయ్య

నాకు కోర్టుకి టైమయింది. వెళ్తొస్తా.

[జోళ్ల చప్పుడు. దగ్గరగా వస్తున్న కెంపుగొంతులు]

శేషమ్మ

కాదో, సుబ్బమ్మా ! కామిపెళ్ళికి అయిదువేలు పోశాం.

సుబ్బమ్మ

అయితేనేమే చేషమ్మొదినా ! సూరిగాడి పెళ్ళికి పదివేలు లాగేరుకాదే. అయిదువేలు మిగులు. ఆ పెళ్లప్పుడు అమలాపురం అమలాపురం అదే గోల. వియ్యంకుడు వెంకటేసుర్లుగారు డబ్బు తేలేక, గిజగిజలాడేడని. యిప్పుడు మళ్ళీ రాజమండ్రీ పెళ్లిలో...

శ్రీరాములు

బహుకాలదర్శనం ! బహుకాలదర్శనం ! చేషమ్మక్కయ్యా ! ఆ(! యేమిటి? యెన్నాళ్లకూ యెన్నాళ్లకూ ! యెప్పటిమాట ? అబ్బో, నిన్నామొన్నా సంగతా ?

శేషమ్మ

యెవరుబాబూ ? మరిచిపోయాను వెర్రిమొహాన్ని.

శ్రీరాములు

అందుకు సందేహమా? అవును మరీ. నువ్వలా అనవలసిందే. ఆ బెట్టు యింకా వుండవలసిందే. మీరు మగపెళ్లివారాయెను. మేము ఆడపెళ్లి వారమాయె.

శేషమ్మ

ఏ పెళ్లి బాబూ?

శ్రీరాములు

వెంకటేసుర్లు మా(వయ్యింట్లో...అమలాపురంలో...

శేషమ్మ

సూరిగాడిపెళ్లా? నాగమణి, వాడి పెళ్లాం.

శ్రీరాములు

ఆ నాగమణి వరసకి నాకు మరదలు. అయినా నన్ను నువ్వు పోల్చుకోలేవు. పెళ్లిలో నాడ్యూటీ హమేషాగా వంట పందిట్లో.

సుబ్బమ్మ

అవును. సూరిగాడి పెళ్లిలో చూసినట్టుంది.

శ్రీరాములు

భేష్! పోల్చింది భూషమ్మొదిన, చేషమ్మక్కయ్యా.

సుబ్బమ్మ

నాపేరు ఘూషమ్మ కాదు.

శ్రీరాములు

కాకపోతే మించిపోలేదు. ముఖవైఖరి చూస్తే నిన్నలా పిలవాల్లనిపించింది వొదినా.

సుబ్బమ్మ

యితగాడెవడేవ్, యిలా మాట్టాడుతున్నాడు?

శేషమ్మ

వెంకటేసుర్లుగారి మేనల్లుట్టే సుబ్బమ్మా! చనువుకొద్దీ...

శ్రీరాములు

వరసకు వొదినవు కాబట్టి అలా అన్నాను. సుబ్బమ్మొదినా! నా తప్పు క్షమించమని మగపెళ్లివారి తరపునా, యావత్తు అమలాపురమూ కోనసీమా తరపునా అడుగుతున్నాను.

శేషమ్మ

పాపం యావఁనుకోకే, అంతలా దేముల్లాడుతుంటే.

శ్రీరాములు

చేషమ్మక్కయ్యా! గ్యాపకంవుందా? ఆ పెళ్లిలో మమ్మల్ని - ఆడపెళ్లివారిని - మీరు మహ యేడిపించేవారు వద్దల్నప్పుడు. వోనాడు

అప్పడాలు లేవనిపించాలని ఆడపెళ్లివారు తినడం మొదలు పెట్టారు. అప్పడాలు విరుస్తూ నంపులుతుంటే, అమలాపురం అమలాపురం యావత్తూ తాప్‌తాప్ ఫెటీఫెటీమని కొంపలంటుకున్నట్టు చప్పుడు. అందులో మగ పీనుగుల దేమి తిండీ. మీది గాని. వొప్పుకుతీరవలసిందే. ఆరోజున సుబ్బమ్మొదిన్ని చూడాలి – పల్నాటియుద్ధంలో నాయకురాలిలాగా, నరకాసురవధ సమయంలో సత్యభామలాగ.

సుబ్బమ్మ

యిదేంవిటే, యితగాడు నన్ను పట్టించాడూ?

శేషమ్మ

పాపం, వొదిన వరస కాదుటే! చదువుకున్నాడు కూడా!

శ్రీరాములు

చేషమ్మక్కయ్యా! ఆ విందురోజున వియ్యపురాలి పాట పాడింది ఆ పిల్ల ఎవరు : 'విసురుకొనుచు వచ్చెను వియ్యపురా లొడ్డనలకు' అంటూ పాడింది?

శేషమ్మ

మా పెద్దమ్మాయి సీతాలక్ష్మి.

శ్రీరాములు

సీతాలక్ష్మి ! ఛేషయిన గొంతు. పత్తిర్రాట్నం! కంయిమని ఫ్యాక్టరీ కూతలాగ.... సీతాలక్ష్మికి పిల్లలా ?

శేషమ్మ

ఆ. అయిదుగురు. యిహచాలు బాబూ.

శ్రీరాములు

ఛెష్. అయిదుగురు అనగూడదు. దిష్టి కొడుతుంది. 'రొండుకావిళ్ల కొమ్మ' అనాలి. సుబ్బమ్మొదినా, నీకు ?

సుబ్బమ్మ

చాల్లే.

శ్రీరాములు

చాలో, లేదో మా అన్నయ్య చెప్పాలి. ఆ చంకని పిల్లాడు కూడా నీ కొడుకేనా ?

సుబ్బమ్మ

ఆ !

శ్రీరాములు

భేష్ ! కంటే కళ్లమూసుకుని కనాలి పిల్లల్ని గాంధారిలాగా. సుబ్బమ్మొదినా. నీకు యీ శ్రీరాములు నమస్కరిస్తున్నాడు. అయితే చేషమ్మక్కయ్యా ! టిక్కట్టుకొన్నారా ? లేకపోతే నేనుతెస్తా. రెండు పెద్ద టిక్కట్లూ, ఆరు చిన్నవీనా ?

శేషమ్మ

అవునన్నయ్యా. ఆఁ ! కొన్నాం.

శ్రీరాములు

రాజమంఁడ్రీలోనే దిగుతారా ? బండిలో యెక్కించి కూడా వద్దును గాని, ఆడవాళ్ల కంపార్టుమెంటులో నన్నెక్కనివ్వరు. అక్షరాలు తెలియ నట్టు యెక్కి కూచుందాం అనుకున్నా, తలుపుమీద ఆడమనిషి బొమ్మ గూడా అఘోరించారు.

శేషమ్మ

ఫరవాలేదన్నయ్యా, మేఁవెక్కుతాం.

శ్రీరాములు

అఁహ, అందుకోసం గాదు. తర్వాత మా వెంకటేసుర్లు మాఁవయ్యకి తెలిస్తే చివాట్లెట్టడూ ? అతనితో చెప్పు చేషమ్మక్కయ్యా, "యిలా శ్రీరాములు పెట్టే పరుసూ బెజవాడ స్టేషనులో పోగొట్టుకున్నాడూ, తర్వాత యెరుగున్న వాళ్లెవరిదగ్గరేనా డబ్బుచ్చుకుని వస్తానన్నాడూ" అని.

శేషమ్మ

అలా యెందుకు సీరాములన్నయ్యా! సుబ్బీ, నీదగ్గరెంతుందే?

శ్రీరాములు

యెంతున్నా నాకొద్దులెద్దూ, పాపం.

శేషమ్మ

అలా కాదు. అక్కడ పుచ్చుకుంటాంలే, సీరాములన్నయ్యా.

సుబ్బమ్మ

ఆరు రూపాయలుంది.

శేషమ్మ

ఇదుగో అన్నయ్యా! ఆ ఆరున్నూ ఈ మూడూ తొమ్మిదీనీ తీసుకో. మరి పరిగెత్తూ. రైలొస్తుందేమో, టిక్కట్టు కొనుక్కో.

శ్రీరాములు

అలాగే అక్కయ్యా! నేను మళ్లీ రాజమండ్రీలో కనబడతాను, మగాళ్ల బండిలో ఎక్కుతాను...ఇదుగో! పిల్లల్ని తొంగి చూడనియ్యకండీ, కిటికీలోనుంచి.

[ట్రెయిను వచ్చిన చప్పుడు, మాటల సందడి]

శ్రీనివాసరావు

ఒరేయ్ చెంచురామయ్యా! ముందు కావలిలో దిగి సుబ్బుకృష్ణయ్యని తీసుకుని నెక్స్ట ట్రెయిన్‌లో మద్రాసు పోదాం.

చెంచురామయ్య

సరే.

శ్రీరాములు

బహుకాలదర్శనం! బహుకాలదర్శనం! యెన్నాళ్లకూ యెన్నాళ్లకూ! యెప్పటిమాట! అబ్బో, నిన్నా మొన్నా సంగతా, చెంచురామయ్యా!

శ్రీనివాసరావు

అయిందా పలకరించడం? మేం మాట్లాడుతుంటే విన్నావుకాబట్టి వీడు చెంచురామయ్యని నీకు తెలిసిపోయింది. నన్ను పోల్చుకోలేవు గాబట్టి, నా పేరు శ్రీనివాసరావు. మేము కావలిలో దిగి, సుబ్బుకృష్ణయ్యని తీసుకుని మద్రాసు వెడతాం. ఇంకా మా సంగతులేవేనా కావిలిస్తే, ముందే చెప్పేస్తా, నీకు తెలియదు కనక.

శ్రీరాములు

[జనాంతికంగా] నీ అమ్మకడుపు బంగారం గాను! నువ్వు అసాధ్యుడిల్లా వున్నావే...ఈ చెంచురామయ్య ఏం జేస్తుంటాడు నాయనా, శ్రీనివాసరావూ ?

శ్రీనివాసరావు

పద్యాలవీ రాస్తుంటాడు.

శ్రీరాములు

వొద్దు బాబూ వొద్దు. మాన్పించెయ్యాలి వెంఠనే. ముదిరితే మహాకష్టం. తనే రాగం అవీపెట్టి చదువుతాడా అభినయిస్తూ ?

చెంచురామయ్య

ఎవడో మహా సరదావాళ్లావున్నాడు. నువ్వెరుగుదువా యితన్ని ?

శ్రీనివాసరావు

యెరుగుదునని అతనికి తెలియదు.

శ్రీరాములు

యెక్కడెరుగుదువు బాబూ నన్ను ?

శ్రీనివాసరావు

రాజమండ్రిలో, బెజవాడలో, కాకినాడలో, విశాఖపట్నంలో ఎక్కడబడితే అక్కడ; స్టేషనుదగ్గర, బస్సుస్టాండులదగ్గర. ప్రస్తుతం నీకు వచ్చిన చిక్కేఁవిటి? పర్సు పారేసుకున్నావా? భార్యకి పురుడొయ్యాలా? పిల్లాడికి చదువా?

శ్రీరాములు

నాయనా ! అన్నీ కూడొచ్చాయి యిప్పుడు...ఇప్పుడేవొస్తా అలా వెళ్లి.

చెంచురామయ్య

ఓహో ! యెరుగున్నట్టు పలకరించి, యేదో సాకు చెప్పి డబ్బు దండుకునే బాపతా ? ముసలిముండాకొడుకు అసాధ్యుళ్లా వున్నాడే, ఆ దిక్కుమాలిన మంచిమొహంపెట్టి.

శ్రీనివాసరావు

అలా అనకు అతన్ని. అతని కథంతా నీకు తెలియదు. ముప్ఫయ్యేళ్ళ క్రితం, దేశంలో అతన్ని ఎరగనివాళ్ళు లేరు. నాన్ కో ఆపరేషన్ రోజుల్లో, ఆస్తి పోగొట్టుకుని, దెబ్బలుతిని, జైల్లోపడి,

ఆలుబిడ్డలూ తానూ మిగిలారు. యిప్పుడు పూట గడవటం కష్టం అతనికి. తానొక్కడే అయితే హాయిగా చచ్చిపోయుండును. పెళ్లాం బిడ్డలకోసం యిదంతా.

చెంచురామయ్య

అయితే ఇలాంటి దగాకోరు పనులెందుకూ? దొంగవేషాలు.

శ్రీనివాసరావు

తక్కువవాడు తక్కువ మోసంచేస్తే, అది దారుణమైన నేరం. ప్రభుత్వాలూ, ప్రముఖులూ చేస్తే, అది రాజకీయతంత్రం, మంత్రాంగం. చిన్నవాడు చిన్న అప్పుచేసి యెగేస్తే వాడికి కారక్టర్ లేదు. భగవద్గీతలో శ్లోకాలు విసురుతూ మధ్య మధ్య ప్రార్థనలుచేస్తూ లక్షలు ఋణంచేసి యెగేసి నిక్షేపంగా గౌరవంగా చెలామణీ అవుతున్నవాళ్ళ నెరుగుదుము. అయితే... శ్రీరాములూ! ఇలారా.

శ్రీరాములు

[దూరంనుంచి] వస్తున్నాబాబూ!

శ్రీనివాసరావు

ఇప్పుడు దేనికోసం చందాలు వసూలు చేసుకుంటున్నావు?

చెంచురామయ్య

అంటే యిదివరకు వేటికోసం చేశాడు?

శ్రీనివాసరావు

ఇదివరకొకసారి కనబడ్డప్పుడు 'ఇప్పుడేం జేస్తున్నావు శ్రీరాములూ, అంటే 'బీహారు భూకంపానికి చందాలు సేకరించుకుంటున్నాను' అన్నాడు. ఆతర్వాత గోదావరి వరద బాధితులకి. అలాగే భగవంతుడికైనా అతనిమీద దయుంది కాబట్టి ఏ వరదో, భూకంపమో వొస్తున్నాయి.

శ్రీరాములు

యేంజెయ్యను బాబూ! ఏదో అలాంటివే చూసుకుంటున్నాను. ఏం అలా చూస్తున్నావ్? నీకూ కోపం వచ్చిందా నామీద?

శ్రీనివాసరావు

నాకెప్పుడూ నీమీద కోపంరాదు. ఇదిగో పది రూపాయలు. నువ్వో పది తీయరా చెంచురామయ్యా. వెళ్ళిరావా? మళ్ళీ ఎప్పుడో?

శ్రీరాములు

[గద్గదికతతో, కళ్లంటనీళ్ళు వచ్చినట్లు] బహుకాలదర్శనం!



# అవ్వ తిరునాళ్లలో తప్పిపోయింది

మా అవ్వ నెరగరూ మీరూ, అవ్వని ? హయ్యో ! సుబ్బమ్మవ్వని ? మావూళ్లో ఆవిణ్ణి యెరగనివాళ్లు లేరే ! అసలు వూరంతా అవ్వనే పిలుస్తారావిణ్ణి. కొద్దిమంది 'సుబ్బమ్మవ్వగారూ' అని కూడా అంటారు. ఆవిడికి కోపం వచ్చినప్పుడు, 'ఆఁఆఁఆఁ ! యెవ్రా **అవ్వ** ! నువ్వు నా కేఁవవుతావురా ? చస్తే దెయ్యఁవవుతావుగాని !' అని గద్దిస్తుంది; అప్పుడు చటుక్కున సర్దుకుని ''సుబ్బమ్మగారూ'' అంటారు. ఒకొక్కొక్కప్పుడు, 'సుబ్బమ్మగారూ' అని పిలిస్తే, 'హారి గాడిదా! వేలెడంతలేవు, బొడ్డుకోసి పేరెడతావురా నాకూ!'' అని దులిపేస్తుంది; వెంటనే దిద్దుకొని ''అవ్వగారూ!'' అంటారు.

ఏఁవయితేనేం? ఆవిడంటే అందరికీ యిష్టఁవే, అవ్వంటే.

అవును. అందరికీ యిష్టఁవే మరి! వాళ్లకేం పోయింది యిష్టం గాక! యెప్పుడో కనిపిస్తుంది వాళ్లకి. కనిపించినప్పుడు యెంచక్కా కుశలప్రశ్నలూ అవీ వేస్తుంది; సాఁవెతల్తో సారాళించి కబుర్లూ కథలూ చెపుతుంది; మాంచిఫారమ్‌లో వుంటే—అంటే హుషారులోవుంటే—పాటలు పాడుతుంది; పాఁవు పాటా అవీ. ఆ కాస్సేపూ వాళ్ళకి కులాసాగా వుంటుంది. వింటారు, పోతారు. వాళ్లకేం? రాత్రీ పగలూ ఆవిడతో యింట్లో వుండే వాళ్ళం, మేం వేగలేక చస్తున్నాంగాని!

అన్నట్టు—అవ్వంటే మీరెరగరన్నారు కదూ సుబ్బమ్మవ్వని — ఆవిడ మమ్మల్నెలా యేడిపిస్తుందో చెప్పేముందు, ఆవిడ రూపురేఖలూ ధోరణీ మీకు తెలియద్దూ? అసలు మా అవ్వంటే, మా నాన్నగారి మేనత్త. ఆయనతాలూకు అయిదెకరాల పొలఁవూ, అప్పారం లోగిలీ వగైరా ఆస్తితో అవ్వకూడా నాకు సంక్రమించింది. మానాన్న మేనత్తంటే దాదాపు డెబ్భయ్యేళ్లపైమాటగదా. అయితేం? నడుం నిటార్గా కదురులా నిలబెడుతుంది. యిష్టంలేనప్పుడు మాత్రం తెలుగులో 'ఐ' అక్షరంలేదూ 'ఐ' దానిలాగ వొంగిపోతుంది. తరుచు కంఠం రైలు గంటలాగ గణగణా మోగించేస్తుంది; యిష్టంలేనప్పుడు పీలగా మూలుగుతుంది. ఈ మధ్య కొంచెం చెడ్డా, గెద్దచూపులాంటిది అవ్వచూపు. అయితే పళ్లమాత్రం తీయించెయ్యడఁవో రాలిపోవడఁవో జరిగింది. వొఖటేవొఖ పై పన్ను మాత్రం — ముందుది — కింది పెదిమమీదికి వొంగి, అక్కడ కాలూది, మాట్టాడు

తున్నప్పుడు రవ్వంత తలాడిస్తూ వుంటుంది. అది అందాని క్కాబోలు వుంచేసిం దవ్వ. మా యింటికొచ్చిన వో పెద్ద మనిషి- అప్పన్నశాస్తుర్లని మాంచి కవిగూడా - ఆయనొక సారన్నాడూ చెమత్కారంగా "ప్రెపంచంలో యే ప్రెభుత్వం వూ చెయ్యలేనిపని సుబ్బమ్మవ్వ గారు చేసిందండీ! వొకేవొఖటి తప్ప యేపన్నూ లేకండా చేసిందీ!" అని. అయితే, అవ్వ మాట్టాడుతుంటే మాత్రిం అతి స్పష్టంగా తెలుస్తుంది.

కొందరు పళ్లులేనివాళ్ళ నోరు లక్కపిడతలాగ డొల్లగా వుంటుంది. మాట్టాడుతుంటే యేంవీ తెరీదు. రొచ్చులో నడుస్తున్నట్టు పుసుకూ పుసుకూ గాలిపోసుకుంటుంది; అంతే, పాత రబ్బరు బొమ్మ కడుపు నొక్కితే చప్పుడైనట్టు. అవ్వలాగాదు.

అయినా వో లోపంవుంది. అవ్వ మాటల్లో 'ప' 'ఫ' అని పలుకు తుంది. 'తప్ఫూ, పప్ఫూ, చెప్ఫూ' అంటుంది, ఆ వొంటిపన్నువల్ల.

అసలు అవ్వవీ - మా సుబ్బమ్మవ్వవీ - పెద్ద జాతీయనాయకుడి వుపన్యాసధోరణి. అయితే అవ్వ తెలివిగా మాట్టాడుతుంది. వోసారీ, వుపన్యాసాల్తో దేశాన్నంతనీ తలదిమ్మెక్కించే వో పెద్దమనిషి మాయింటి కొచ్చాడు. ఆయన సభలోనేగాక సభయివతలగూడా సభలో అంతా మాట్టాడతాడు. మా యింటి కొచ్చిన పదినిమిషాల్లో మొదలెట్టాడు ప్రసంగం. మరి పది నిమిషాల్లో అవ్వ కలగజేసుకుని రంగస్థలంలో

విరగబడింది. ఆయనగారు తోకజాడించి. నాటికీ నేటికీ అవ్వకి 'నమస్తే'. అంతే! ఆవిడ సన్నిధానంలో నోరువిప్పడు.

వెనకటికి వో కవిగారు చెప్పినట్టు 'నిప్పుల, నీళ్ళను, చప్పిదుప్పిళ్ళను, తీర్థాల, తిరునాళ్ళ త్రిప్పటలను' గడిదేరి గడ్డకట్టిన ఘటం అవ్వ. పెళ్ళికి కాస్త ముందో వెనకో పోయాడు పెనిమిటి. డెబ్భైయేళ్ళపైని యేకధాటీగా అంటే యేకటాకీని వైధవ్యరాజ్యాన్ని పరిపాలించి పారేసిన రాణీబహద్దర్. గట్టు బ్రహ్మచారిణి. యాక్సిడెంట్, అంటే ఏ కారో రైలో కలగజేసుకుంటే తప్ప మార్కండేయాది చిరంజీవుల లిస్టులో మనిషి మా అవ్వ.

నాలుగ్గంటలకే లేచి తొలికోడిని లేపడం, తలుపులన్నీ తెరిచిపారేసి పాచిపనులూ అవీ చెయ్యడం, చెంబులూ గిన్నెలూ చప్పళ్ళుచెయ్యడం, స్నానం చెయ్యడం, పత్తిరాట్టంలాంటి కంఠంవెత్తి 'ప్రాత స్మరామి' వగైరా శ్లోకాలు చదవడం, మా నిద్దుర లగచెయ్యడం – ఇలాగ రోజంతా జరిగే తంతునుగూర్చి అట్టే చెప్పడం నా కిష్టంలేదు. ఈ వివరాలుకూడా మీకు చెప్పకపోదును, కాని మీకోసమే చెప్పా యిదంతా. అవ్వ ధోరణిలో చెప్పవలసివొస్తే యెప్పుడైనా అవ్వ యెదురయితే 'చప్పున తప్పుకుని' మీరు దాటిపోవచ్చుని! అంతేగాక, ఇవన్నీ చెప్తేగాని, మేమావిడతో యెలా వేగిపోతున్నామో మీకు తెలీదని గూడా యిన్ని వివరాలిచ్చా మీకు. ఇంట్లో మమ్మల్ని ప్రతిఘడియా యేడిపించే పనుల్నిగూర్చి నేను చెప్పనే లేదు. హాయ్యో బాబో! యేం వవ్వండీ బాబూ! కోటయ్యగారు క్లీన్గా భోంచేసిన

విస్తట్లోనే కొత్తదనుకున్నానని, మా శాషమ్మ దొడ్డమ్మకి మళ్ళీ వొడ్డించడం, నీళ్ళనుకొని చెంబెడు సాముర్లకోట పప్పునూనితో చెయ్యికడుక్కోవడం, యెంగిలి విస్తళ్ళన్నీ కట్టగట్టి గోడమీదనుంచి వీధంట వెడ్తున్న మేస్ట్రీటు వీర్రాజుగారి తలమీద పడేటట్టు విసిరివేయడం, గోవిందరావు గారి చేతిమీద వేడిపులుసు వొడ్డించాలని వొడ్డించడం — యీ గొడవలన్నీ ముందు ముందు మీకు తెలుస్తాయి. అలాగే సినీమాకు వెళ్ళడం, సర్కస్ వాళ్ళ బోనుల దగ్గిర కదలకండా నిలబడి అక్కడ జెంతువుల్తో జెత కట్టడం, శాసనసభసీటుకోసం మావూళ్ళో చేసిన పెద్ద ఎన్నికలసభలో రభస చెయ్యడం—యిలాంటివన్నీ కూడా యిప్పుడుకాదు. తర్వాత చెప్తా.

అయితే, వో చిన్న సంగతిచెప్పి - అది చెప్పితీరాలి - ఆవిడ తిర్నాళ్లలో తప్పిపోవడం దగ్గిరకొస్తా.

అప్పన్నశాస్తుర్లుగారని చెప్పానే ఇందాకా, కవిగారు, ఆయన వోసారి అవ్వమీద పంచరత్నాలు చెప్పాడు భోజనాలదగ్గిర, సరదాకి :

''సుగుణమణిగణ నికురుంబ సుబ్బమాంబ''

అనిన్నీ,

"సుజన సేవావలంబ గం. సుబ్బమాంబ"

అనిన్నీ.

''గం'' అంటే గంగాభాగీరథీ సమానురాలట.

ఆయన పద్యాలు చెప్తుంటే, అవ్వ ముసిముసినవ్వుల్తో అటూ యిటూ తిరుగుతూ, ఏదో తన గొడవ కాదన్నట్టూ నిర్లక్ష్యంగా పట్టించుకోనట్టూ విననట్టూ అంతా విని, "అవి వో కాయితం మీద రాసిపారెయ్యండి బాబూ, మా నాన్నిగాడికివ్వండి" అంది.

నాన్నిగాడంటే మా పెద్దబ్బాయి. వాడంటే మా అవ్వకిష్టం. మానాన్న పేరని! వాడూ, గడుసురాస్కెల్, యేం చేశాడూ? ఆ పద్యాలు తీసుకుని, వల్లించి, అడపా తడపా పెద్ద రాగవరసపెట్టి అవ్వదగ్గిర చదవడవూ, ఆవిడదగ్గిరేదేనా కొట్టేయడవూ. ఈ పద్యాలవెర్రి అవ్వ నెంతదాకా పట్టుకుందీ అంటే, వో సారి నాతో అందీ - "వారే అబ్బాయీ! నేను పోయాక పదకొండో రోజున యీ కవుల్నందర్నీ పిలిపించి నామీద పజ్యాలు చెప్పించరా" అని.

ప్రస్తుత మేవిటంటే, నాన్నిగాడు శివరాత్రి తీర్థాని కెళ్దామని అవ్వని రెచ్చగొట్టాడు. నాకిష్టంలేదు. "తీర్థములు మానసములు ముక్తి ప్రదములు" అంటూ "సత్యము తీర్థము" అంటూ కవి చెప్పిన మాటల్లో నమ్మకం వున్నవాణ్ణాయెను. అయితే యేం జెయ్యాను? అవ్వా నాన్నిగాళ్ళల్లో యే ఒక్కళ్ళనీ లొంగదీయడవే కష్టం: యిద్దరూ పట్టు కున్నారాయె!! పోనీ యిల్లేనా ఆనాటికి విశ్రాంతిగా ఉంటుందనిన్నీ దారిపొడుగునా అస్తమానవూ అవ్వకోసం పంచరత్నాలు పద్యాలు చదివి నాన్నిగాడి తెగులు కుదురుతుందనిన్నీ సరేనన్నాను, చివరికి.

ఆ తీర్థానికే వెళ్తున్న రాఁవయ్యకాపుని బతిమాలుకొని, అతని రెండెడ్లబండిలో మావాళ్ళనీ కుక్కాను. తోవలో అవ్వ కునికిపాట్లుపడి కిందపడకండా రాఁవయ్యకాపు పెద్దకొడుకుని బండి చివర బిరడాలాగ బిగించాను. ఈ బిరడా సంగతి తర్వాత చెప్తా.

వాళ్ళు తెల్లారగట్టే వెళ్లారు. సాయంకాలఁవో, రాత్రి పడుతూంటేనో రావాలి. మూడు నాలుగ్గంటలకి యేదో పనివుండి వీథిలోకి వచ్చా. వీథరుగు పక్కని బిక్కమొహం వేసుకుని, యేడిచి యేడిచి వాచిన యెర్రకళ్ళా వాడూ, నాన్నిగాడు వొదిగి నిలబడివున్నాడు.

''ఏఁవిరా? అవ్వేదిరా?'' అన్నాను.

''త-త-త-'' అన్నాడు.

''ఏమిట్రా తతత? తప్పిపోయిందా? చ చ చ కాదుగదా, అంటే చచ్చిపోలేదుగదా?'' అనడిగాను.

''తీర్థంలో అవ్వ కనబళ్ళేదు'' అన్నాడు వాడు మెల్లిగా.

'ఆఁ??' అన్నాను. నా గుండె గుభేలుమంది. గోదార్లోపడిందేఁవో! కారుకింద పడిందేఁవో! గుండె ఆగిపోయిందేఁవో. ముసల్ది! నాకు మహా జాలీ, దుఃఖం వేసుకొచ్చాయి. అసలు అవ్వంటే మా అందరికీ యెంత యిష్టఁవో అప్పుడు తెలిసొచ్చింది నాకు. అవ్వని తీసేస్తే లోకం యెలా

వుంటుందో మాకు తెలియదు. పాపం, ఆవిడ కెవరున్నారు? నిజానికి నాకు ముసలాళ్లను జూస్తే ఎంతో దిగులు. ముందుకు చూసుకుంటే నోరుతెరుచుకుని దగ్గరగా వొచ్చే చీకటిఘాతం గాక వాళ్లకేం వుంది ?

మా అవ్వ చూపులు వొక్కొక్కప్పుడు, దూరాన ఆకాశాన పోయే పక్షుల్లాగా వుంటాయి, యెక్కడికో యెక్కడికో పోతూన్నట్టు. అప్పుడు నాకు భయంవేస్తుంది. అవ్వ వొక్కొక్కప్పుడు పొడుగ్గా నిట్టూర్చేది ; ఆ నిట్టూర్పు చిన్నతనం నుంచీ యెనభై యేళ్ళ దార్లోబడి పాకివచ్చినట్టుండేది. ఇప్పుడు యీ మాటలన్నీ స్తిమితంగా అంటున్నాను గానీ అప్పుడు,....

"యేంవిట్రా, యేం జరిగిందీ?" అని నాన్నిగాణ్ణి అడిగాను.

గోదావర్లో స్నానం చేసొచ్చారట. గుళ్ళోకూడా వెళ్లొచ్చారట. స్వామి దర్శనంవయ్యాక, గుళ్ళో మండపంమీద కూచుని వాడిచేత సరదాగా పంచరత్నాలు గూడా చదివించుకుందిట. తర్వాత యివతలికి వొచ్చార. రంగులరాట్నం దగ్గిరికొచ్చేటప్పటికి నాన్నిగాడు అదెక్కుతానన్నాట్ట. వాడు కాస్సేపు దానిమీద తిరిగొచ్చేసరికి అవ్వక్కడ లేదు. వాడు మొదట యిక్కడా అక్కడా చూసి, కనబడకపోతే కంగారుపడి, "అవ్వా,అవ్వా" అని పిలుస్తూ తీర్థంవంతా తిరిగీ, బళ్ళు విప్పినచోటు దగ్గిరికొచ్చి, అక్కడకూడా ఆవిడ కనబడకపోతే అయిదు మైళ్లూ నడచి యింటికొచ్చేశాడు, యిదీ కథ.

వెంఠనే రాఘవయ్య కావొచ్చాదేమో వాళ్ళింటి కక్కబురు చేశాను. కాఘవిగాణ్ణీ గోవిందునీ తిర్నాళ్ళకి పరిగెత్తించాను. అవసరమైతే పోలీసుల్తోగూడా చెప్పమన్నా. ఇంట్లో మా ఆవిడా పిల్లలూ నిశ్శబ్దంగా కూచున్నారు. కుక్కిన పేనుల్లా. నేను శివస్మరణచేస్తూ బయటికెళ్తూ, లోపలికొస్తూ మతిపోయినట్లు తిరగడం మొదలెట్టాను.

రాత్రి పదయింది. అవ్వలేకండా రాఘవయ్యకాపు బండి వొచ్చేసిం దట. కాఘవిగాడూ గోవిందూ వట్టిచేతుల్తో, అంటే అవ్వలేకండా వొచ్చే శారు. ఇహ వూరుకుంటే బావుండదని, మా ఆవిడ లోపల్నుంచి కొంచెం కూనిరాగం యేడుపు ప్రారంభించింది. చంటిపిల్లాడు గూడా యథాశక్తి వాళ్ళమ్మకి తోడయ్యాడు. చూడ్డానికీ, ఉబుసుపోకా, సాహంగ్రామం మా యింటి దగ్గిరచేరి, అవకాశం రాగానే సరదాగా పరామర్శలోనూ, అవ్వ దివ్యస్మృతుల్ని నెమరు వేసుకోడంలోనూ, అప్పుడే పడిపోయారు.

ఇదీ తిర్నాళ్ళరోజున అర్ధరాత్రి మా స్థితి.

అంతలో "సన్యాసిరాజుగా రిల్లిదేనా?" అని దూరాన్నుంచి గద్దిస్తున్న మాటలు వినబడ్డాయి. అందరూ అటుతిరిగి చూశారు.

"యెవరు బాబూ, యేఁవిటి?" అని గావుకేక పెట్టాన్నేను. చీకట్లోంచి వొస్తూ పోలీసుజెవాను కనబడ్డాడు. కూడా ఠీగ్గా నడుస్తూ, చీకట్లో దీపస్తంభంలాగా, జెవాను కంటె ధాటీగా అవ్వ సాక్షాత్క

రించింది: "అవ్వొచ్చింది" అని కేకేశాను. లోపల్నించి అందరూ "ఘొల్లు" మని యివతలికి వొచ్చారు.

కొందరుమాత్రం 'అరెరే: అవ్వ అప్పుడే దొరికేసిందే, నాల్రోజుల పాటు సరదా పోయిందే' అని దిగులుమొహం వేశారు.

పోలీసు జెవాన్, "యిదుగోనండీ ముసలావిడ. నా ప్రాణాలు తోడేసిందీ : యీవిణ్ణి తిర్నాళ్ళకీ తీర్థాలకీ పంపి, దేశంమీద వొదుల్తా రేంవిటయ్యా? యీవిడకంటె మా సూపరెంటు నయం" అని చీదరించు కుంటూ అన్నాడు.

"ఫోరా: నే సూఫరింటునే. నాకేంరా? బహద్దర్ని: శెలవిచ్చాను ఫో" అంది అవ్వ. వాడు పళ్ళుబిగించి కొరకొర చూసి, చీకట్లోకి నడిచి, అక్కడ ఖాండ్రించి వుమ్మేసి చక్కాపోయాడు.

ఇహ తీర్థంలో జరిగిన కథేవింటంటే ...

నాన్నిగాడు రంగులరాట్నం తిరుగుతూంటే పిల్లలందరికీ జీళ్లూ, జంగిడీ మిఠాయీ, తొక్కుడుండలూ కొందామని, ఆ కొట్లకెళ్ళి వొక్కొ క్కళ్ళకీ పేరు పేర్నా వొక్కొక్క పొట్లాం కట్టించిందట అవ్వ. అక్కడ చిల్లర విషయంలో కొట్టువాడితో పేచీ వొచ్చి, వాణ్ణి ఘాకెయనంచేసి పారేసి, దమ్మిడీలతో సహా వాడి దగ్గర్నుంచి రాబట్టి, పాత్ర సాంవాను

దుకాణంవైపు దండయాత్ర మళ్లించి, అక్కడ ఆ దుకాణంమీద పడిందట. అక్కడ రాగిచెంబూ గరిటా బేరం తేల్చడానికి రావణరావణ యుద్ధంచేసి, రాచ్చిప్పల కొట్టువైపు దృష్టితిప్పి, అటు దాడిచేసింది. దారిలో డక్కీ డమడమలబండీవాడు తారసిల్లితే, అన్నీ వాయించీ, నడిపీ, చూసీ, అమ్మేవాడు పారిపమని యేడ్చేదాకా వాణ్ణి ఆపి, అంతలో పుష్మా కయ్యగారి కుటుంబం కనబడితే వాళ్ళతో పూసులాడి, అట్టే నాలుగడుగులేసే సరికి నాన్నిగాడు గ్యాపకానికొచ్చాడు. అప్పటికప్పుడే పొద్దు వాల్తోంది.

''నాన్నిగా నాన్నిగా'' అని తీర్ధంవంతా తిరగడం మొదలెట్టింది. బళ్ళ దగ్గిరికొచ్చి చూస్తే, రావయ్యకాపు బండీ వెళ్ళిపోయింది. మళ్లీ తీర్థంలోకి వొచ్చింది. ''మా నాన్నిగాడు కనబడ్డాడా?'' అనడుగుతూ, ఎవళ్ళనడిగినా వాళ్లు పట్టించు కోలేదు. అప్పటికి కంగారుపడ్డం మొదలెట్టిం దవ్వ. ఇంతలో కనబడిన పోలీస్‌జెవాన్‌ని కూడా అడిగింది. వాడు వూరూపేరూ అన్నీ అడిగి పోలీస్‌స్టేషన్ దగ్గిర కూచోబెట్టాడు.

''అమ్మా! భైపడకండి, ఇంటికి తీసికెడతాం'' అని పోలీసు వాడంటే, ''ఎవడికిరా భయం?'' అని ధీమాగా మొదట అన్నప్పటికీ, నాన్నిగాడి కోసం లోపల్లోపల కంగారుపడిపోయింది అవ్వ: ఆవిడ పోలీస్‌స్టేషన్‌లో కూచున్న సమయంలోనే, కావిగాడూ గోవిందూ ఆవెకోసం గాలించిపోయారు. యిదంతా చెప్పాక యిలాగంది అవ్వ: ''ఆ రాచ్చిప్పల దుకాణం దగ్గిరాలస్యవయి పోయిందర్రా! అక్కడే వొళ్లు మరిచిపోతూంటాను. ఏవిరా నాన్నిగా! శివరాత్రి గూడాను. అప్పన్న

శాస్తుర్లుగారి పద్యాలు నామీద రాసినవి చదవరా'' అంది. అందరూ పకపకా నవ్వారు. నాకు మాత్రం వొళ్లు భగ్గుమంది. ఆవిడ గొంతుక పట్టుకుని ఆరాత్రి ఆఁవెని శివసాయుజ్యం పొందిద్దాఁవనుకున్నాను. దిక్కుమాలిన పాపభయఁవో, దండనభయఁవో వొచ్చిపడి మళ్ళీ తమాయించుకున్నాను. అంతకంటేగూడా నా లోపల పిచ్చియిష్టంగూడా యేడిసిందాయెను అవ్వమీద, మా సుబ్బమ్మవ్వ మీద!



# రిక్షావాలా



ఆఫీసుగేటు దగ్గర మొదట చూశానతన్ని రిక్షాసీటు ముందు కాళ్లు పెట్టుకునేచోట కూచుని, వెనక్కు ఒయ్యారంగా ఒరిగున్నాడు, సీటుమీద తల పెట్టుకొని, పడుకున్నట్టు. ఒకపాదం రవంత ఆడిస్తున్నాడు. కళ్లర మోడ్చుకుని సిగరెట్టు పీలుస్తున్నాడు, హుక్కాకన్న దర్జాగా.

నేను ఆఫీసులోనుంచి వస్తుంటే, అలా విలాసంగా వాలి వుంటూనే, రమ్మనట్టు దర్జాగా నావైపు సైగచేస్తూ తల ఊపాడు. నేను రిక్షా దగ్గరికి వచ్చాకకూడా, దిగకుండానే, లేచి కూచోకుండానేకూడా, 'హెక్కడిక్కి పోతావ్' అని అడిగాడు. నాకు తిక్క వేసింది. ''ఏం నవాబుగారూ,

దయుంచి తఖ్తునుంచి దిగితే" అంటూ రెండు మాటలతో ఎత్తిపొడుద్దామను కున్నాను. కాని ఊరుకున్నాను; వెనక ఒక బండివాడితో జరిగిన ఒక సంఘటన జ్ఞాపకంవచ్చి.

అదేఁవిటంటే, ఆమధ్య మా ఊరునుంచి మరోఊరు వెడుతున్నాఁ ఒంటెద్దుబండిలో; ఒక ప్రసిద్ధకవితో. అసలు బండివాడు మాకు పుట్టు విరోధుల్లో ఒకడని తెలియదు. ఎక్కింది మొదలుకుని ఏడిపించడం మొదలెట్టాడు. పాడుగొంతుతో అరవడమూ, ఎద్దుని అదిలించడమూ, బండిలోకి అడపా తడపా దాని తోకకుంచెతో గోమయం ప్రోక్షింప జెయ్యడమూ, నడమ నడమ దిక్కుమాలిన అపకతపక గాడిదగత్తర పాటేదో పాడుతుండడమూ, మమ్మల్ని ఏవోమాట లంటూండడమూ, బండివాడి ధోరణి చాలా అవమానకరంగా ఉంది. నాకు పిచ్చెత్తింది. "ఏఁయ్ నేనెవరో నీకు తెలుసునా? పెద్దకవిని. కృష్ణపక్షం రాశాను. ఈయన మరీ కొమ్ములుతిరిగిన కవి. ఫలానా పుస్తకం రాశారు, తెలిసిందా?" అన్నాను. "ఫ ఫ ఫావయ్యా! రాశావు మహ! రాశాట్ట; ఈ యెద్దునయం, తోకతో రాస్తుంది సుబ్బరంగా. ఆయిదం రాయలేక పోయావూ? బండిలో పల్లకుండా కూకోడం రాతగాదు, రాశారంట రాశారు దిగండెహే" అని గద్దించాడు. మేం మరి మాట్టాడలేదు. ఒకళ్లకేసి ఒకళ్లం చూసుకోలేదు. మహాకవులం గనక! ఈ మాట మమ్మల్ని దాటి పొక్కనియ్యలేదు.

అలాగే అహమ్మద్‌ని, అంటే ఆ రిక్షావాణ్ణి, ఏమనకండా ఊరుకున్నాను. అందులోనూ నలుగురూ ఎరిగున్నవాళ్లూ, పెద్ద మనుషులూ

కనబడేచోట, వాడితో సజావుగా ఉండడమే సబబూ, క్షేమం! ఎంచేతో గాని నేను చూస్తున్నా-బడాయివాడికి పదిమందిలోనే అవమానం జరుగు తుందేం? మీరు చూశారో లేదో, షోకిల్లాయే ఆడపిల్లల దగ్గిర అరటి పండు తొక్క-మీద కాలెయ్యడం, అరఫర్లాంగు జారడం, అటూ ఇటూ చూడకండా అటువైపునించి అల్లాగే వెళ్లిపోవడం జరుగుతుంది.

అహమ్మద్‌కన్న అరటిపండుతొక్కే నయం. అరటిపండు తొక్క-కి కాళ్లలేవు; కనక కదలదు.

అహమ్మద్ అగుపించిన చోటల్లా ఏదో అని ఏడిపించగలదు. కనక, ఆ రోజున ఏం చేశానూ? మొహంమీద మంచి ఇష్టపునవ్వేపెట్టి, కిరాయిబేరం మొదలుపెట్టాను. వాడు బదులునవ్వు పెట్టలేదు, పరిచయం లేకండా తనతో అనవసరపు చనువు కుదరదన్నట్లు. అబ్బో! అవసరం అయినప్పుడు అహమ్మదులో బలే దర్జా ఉంది.

తర్వాత తర్వాత క్రమంగా అహమ్మదు చాలావరకు నా సొంత రిక్షావాడయిపోయాడు. ఈ రెండు మూడేళ్లల్లో అతని గుణాలూ, ధోర ణులూ, సంసారపు కష్టసుఖాలూ, కొంతవరకు నేను గ్రహించాను. అతనికి గూడా నామీద కొంత యిష్టమూ, గౌరవమూ వంటివి కలిగాయని నేను అనుకుంటాను.

మొదటిరోజున అహమ్మదుని చూచినప్పుడు ఒక మోకాలిదగ్గర చిరిగి, కాళ్ల అంచులదగ్గర తుక్కు-తుక్కయి రేగిపోయిన ఇజారూ, వీపు

మీద వంకరటింకరగా వేసిన రూపాయిసైజు రెండు మాసికలతో బొత్తాల్లేని కమీజూ వేసుకున్నాడు. ఆ చిరుగుల సంగతీ, ఆ మాటుల సంగతీ అహమ్మదుకి తెలియదు. అహమ్మద్ చాలా ఉదాత్తుడు. పుట్టుక తోనే పాచ్చా!

నా సంగతి తెలిశాక, అహమ్మద్ సామాన్యంగా తరచు టైమయ్యే వేళకి, మా ఆఫీసుగేటు దగ్గర రిక్షాతో నిలబడి వుండడం రివాజయి పోయింది. నన్ను పిలవడం, సైగచేయడం లేదు. బేరమాడకండానే నేను రిక్షా ఎక్కడం, అతను నావైపయినా చూడకండా ఇంటికి తొక్కడం, దిగి నాచేతి కందిందేదో అతనికివ్వడం, తీసుకుని రిక్షా తిప్పుకుని అహమ్మద్ వెళ్లిపోవడమూను! ఒక్కొక్కప్పుడు, నాకు సరదా పుట్టినప్పుడు, బాడిగకిమించి చాలా ఎక్కువ యిస్తే, అతి సహజమైన దర్జాతో ఒక చిరు సలాంచేసి, స్నేహితుడిదగ్గర పుచ్చుకున్నట్లు పుచ్చుకుని అతను వెళ్లి పోతాడు. నకిలీతనం, నంగితనం, చచ్చా, దేవుకోలూ యేమీలేదు. అహమ్మద్ బహద్దర్!

మావాడు రిక్షా తొక్కడాల్లో వింతలూ విశేషాలూ కొన్ని చెప్పాలి. వేలమంది జనం క్రిక్కిరిసి తొక్కిళ్లాడుతూ ఉండేచోటా, కారుమీద కారు తరిమేచోటా, లేడికన్నా, బాణంకన్నా రిక్షా దురుసుగా తొక్కుతాడు; నకులుడులాగ. పిల్లాజెల్లా నెవరికైనా అప్పజెప్పి బయలుదేరడం మంచిదనిపిస్తుంది అలాంటప్పుడు. ప్రాణాలతో బయట

పడ్డం కేవలం అదృష్టం : అయితే, ఎవ్వరూ జనంలేనిచోట నెమ్మదిగా, నిదానంగా తొక్కుతాడు.

అహమ్మద్ కే గాక అహమ్మదు రిక్షాకి కూడా ఆడపిల్లల అలికిడి ఇట్టే పసిగట్టడం వచ్చును. ఆ పిల్లల్నిబట్టీ, ఆ పరిస్థితుల్నిబట్టీ, వాళ్ల దగ్గర చూపించవలసిన కళాప్రత్యేకతబట్టీ రిక్షాను రివ్వునతొక్కడమూ, మెల్లగా నడిపించడమూ, మెలికలుగా నడిపించడమూ మొదలైనవన్నీ ఆధారపడుంటాయి. అప్పుడు ఎంత అరిచి అదిలిస్తున్నా, రిక్షాలో కూచున్న ఆసామీకీ అహమ్మద్ కీ యేమీ సంబంధం వుండదు. అహమ్మద్ కి కొన్ని మెలకువలు కూడా వచ్చును : సైకిలు తొక్కుతూ తొక్కుతూ నడుము అజంతాబొమ్మలా ఒక పక్కకి విరవడం, తొక్కుతూ తొక్కుతూనే చేతులురెండూ గాలిలోకి చాపెయ్యడం, సందుమలుపుల దగ్గర హాండిల్ బారు పిడులు వదిలేసి పిక్కలబలంతో, నడుంబలంతో సైకిలును ఒరగా మళ్లించెయ్యడం వంటివి.

మొట్టమొదటి రోజుల్లో అహమ్మద్ ది చాలా పాతరిక్షా. అతని చొక్కా మాసికల్లోంచి గుండెమీది వెండ్రుకలు ఎలా పైకొస్తాయో, అలాగే సీటుకన్నాల్లోంచి రవంతపీచు ఇక్కడా అక్కడా పైకొచ్చేది. తొక్కుతూన్నప్పుడు పెడల్ చెయిన్ పెటపెటమని చప్పుడు చేసేది. తరుచు గాడి తప్పి ఊడిపడేది. వర్షాకాలంలో కప్పుకునేందుకు కీలుగుడ్డ ఉండేదికాదు. చిరిగి తడిముద్దయిన మామూలుగుడ్డనే మొహం దగ్గరనుంచి కప్పేవాడు. అయితే, అతన్నిగానీ అతని రిక్షానిగానీ అవహేళన చేయడానికి ఎవడికీ

దమ్ములేవు. అతనికున్నంత దర్జా, పాతకాలపు ఠీవీ, ఆ రిక్షాకీ ఉండేది. ఛఠావు వచ్చినప్పుడు చాలామందిలాగ అహమ్మద్ కిందికి దిగి రిక్షాని చేతులతో పైకి తోసేవాడుకాదు. ఎంత శ్రమపడైనా సరే, తొక్కేవాడు. అంతే; అహమ్మద్ దర్జాయే వేరు. అతనిది ఎత్తునుంచి దిగే గుణంకాదు.

ఈమధ్య కొత్తరిక్షా తెస్తున్నాడతను. తళతళలాడే స్ప్రింగు పైర్లతో చక్రాలూ, నిగనిగలాడే బాడీ రంగూ, తళతళలాడే టాపూ, మెత్తటి సీటూ, చాలా కొత్తదీ అందమైనదీనూ. ఈ రిక్షాకి మరో షోకుంది. ఘల్ ఘల్, ఘల్ ఘల్ మంటూ ఎంతో హాయైన చప్పుడు చేసే మువ్వలున్నాయి దీనికి. గజ్జెల గుర్రమిది; నాట్యకత్తెయిది; అందెలూ, కడియాలూ వేసుకున్న హంసయానయిది. అబ్బో! ఆమువ్వల సవ్వడి సంగతి అహమ్మద్‌కీ తెలుసు, ఆ రిక్షాకీ తెలుసు. వచ్చే మనుషుల్నిబట్టీ, ఆగే చోటునుబట్టీ, పోయే దారినిబట్టీ దాని ఘల్ ఘల్‌లలో రవ్వంత దురుసూ, ఆవంత విలంబం, అన్నీ వస్తూంటాయి. కేవలం ఆ మువ్వలచప్పుడు విని నేను అహమ్మద్ మనస్సునే పసిగట్టగలను. నేను ఎన్నిసార్లో పరిశీలిస్తుంటాను. పంపు దగ్గరనుంచో, నీళ్లు నింపుకున్న కడవల్ని నడుములికి తగిలించో, బుజాలనో తలమీదనో పెట్టుకునో విలాసవతులు వెడుతూండడం, దారిలో కోడెగాండ్రు తారసిల్లడం, వాళ్లు నిర్లక్ష్యంగా మెడ తిప్పకుండా వెడుతూండడం, కాని కుండలో నీరు ఆవంత తుళ్లి, ఆవంత పట్టలేక అంచుల మీదనుండి గళుక్కుమనడమూనూ!

ఆః ఇది నే నెన్నిసార్లో పరిశీలిస్తుంటాను ఎందుకొచ్చిన నిర్లక్ష్యం. కడవలో నీరు పడుచుమనసులో దుడుకుతనం పట్టిస్తుంటేను ? అలాగే అహమ్మద్ రిక్షా మువ్వలూను. అతను సూటిగా ఇటూ అటూ చూడకండా వెడుతున్నట్టుంటాడు గాని, ఆ వెడుతున్నవాళ్లని అతను చూసినట్టు ఆ మువ్వలచప్పుడులో మార్పులు చెప్పేస్తుంటాయి.

పొద్దున దారిని వస్తూ, కనబడనివాళ్లకి 'సుప్రభాతం' అంటున్నట్లుంటాయి అవి. ఒకప్పుడు 'పనిమీదవున్నాం, పలకరించకండి' అన్నట్లు పలుకుతాయి. ఒకప్పుడు 'లోపల పెద్దవాళ్లున్నారు, ఇప్పుడు కాదు' అంటాయి మువ్వలు. ఒకప్పుడు హాయిగా తలూపుకుంటూ పాడతాయి. మరొకప్పుడు 'అబ్బ! మరెంత సేపురా యీ బరువు' అన్నట్టు ఈడ్చుకుంటాయి; ఏడ్చుకుంటాయి. ఇంటికెళ్లేటప్పుడు ఏమీ వినిపించుకోవు.

అహమ్మద్‌కీ నాకూ మొదటి రోజుల్లో, అంటే అన్యోన్యం గ్రహించుకోనప్పుడు, కొన్ని తిక్కలు వచ్చాయని చెప్పాగా ? పెద్దలతో నడివీధిని వెడుతున్నప్పుడుకూడా, ఎదురైనప్పుడు స్నేహంగా తలూపేవాడు. 'ఎక్కడ్కి పోతావ్?' అనే వాడొకప్పుడు 'వస్తావా? ఎక్తావా?' అనే వాడింకొకప్పుడు. నాకు దర్జాకు లోపం అనిపించేది. నాకు ఒళ్లు మండేది. అలా పలకరించగూడదని చెప్పాలనిపించేది. సీరియస్‌గా దీర్ఘముఖం పెట్టబోయేవాణ్ణి.

సిగ్గూ బిడియం లేకగాని, అహమ్మద్‌కంటే నేనేమంత గొప్ప ? ఏమంత దర్జా! ఇన్ని బట్టలూ, ఇన్ని పూతలూ, ఇన్ని చదువులూ,

పదవులూ, సంస్కారాలూ, ఇన్నింటితో తెచ్చిపెట్టుకున్న కృత్రిమపు హోదా ! ఆ చిరుగు ఇజారూ, కమీజులూ, శ్రమజీవి కీవి ముందు తెల్ల బోయి ధూళిలో దాచెయ్యాలనిపిస్తుంది వీటిని. అహమ్మద్ ఎప్పుడూ తాను శ్రమజీవిననీ, నేను సుఖజీవిననీ అనే అభిప్రాయం తనకు తోచినట్లే కనబడలేదు.

రెండుసార్లు నాకు వింతగా కనబడ్డాడు అహమ్మద్. ఓసారి నలుగురైదుగురితో కలిసి ఒక రిక్షాలోనే కనబడ్డాడు. అందరూ రిక్షావాళ్లే. ఒకడు తొక్కుతున్నాడు, ఒకడు నిలబడ్డాడు, ఒకడు హేండిల్‌బారు పట్టాడు-అలా. మరోరోజున అతను, కొత్తగళ్ల లుంగీ, కొత్తగళ్ల చొక్కా, టోపీతో కనబడ్డాడు. ఆ రోజున అడిగాను-మా యింటిదగ్గర కుర్చీమీద బలవంతాన కూచోబెట్టి అతన్ని: అతని సంసారపు గొడవలు. తల్లీ, తండ్రీ ఉన్నారట; ముసలివాళ్లు. భార్యా, ముగ్గురు చిన్నపిల్లలూ. ఎప్పుడైనా సినిమాకి వెడతాట్ట. ఆడవాళ్లు రారన్నాడు. తాగనన్నాడు కొందరిలాగ. రోజుకి కొత్త రిక్షాకి రెండురూపాయలు అద్దె ఇచ్చేస్తా నన్నాడు. ఓ అద్దె గదిలో ఉన్నారటందరూ. పండుగలూ, పబ్బాలూ, జబ్బులూ, ఆసుపత్రులూ, చిక్కులూ, ఉపవాసాలూ అన్నీ సర్దుకుంటూ, ఆలుబిడ్డల్ని చూసుకుంటూ, బతుకులో తొక్కుకుపోతూవున్న అహమ్మద్‌ని సైకిల్‌రిక్షానుంచి విడదీసి వేరుగాచూడ్డం ఎలాగో నాకు తెలీదు.

ఆమధ్య కొద్దిరోజులు అహమ్మద్ నాకు కనబడలేదు. మొన్న హఠాత్తుగా కనబడ్డాడు. నాతో సీను అనే స్నేహితుడున్నాడు. అవి రాబ్

పండుగరోజులు. నేను రెండుచేతులు పట్టుకుని, సైకిల్‌కి అవతల ఉన్న అహమ్మద్‌ని ఇవతలనుంచి కౌగలించుకున్నాను. అతను సైకిల్ తిరిగి వచ్చి, నా ఎదురుగా వంగి సలాం పెట్టాడు. నాకు దుఃఖం వచ్చింది.

అహమ్మద్ నావైపు చూడలేదు. రిక్షా ఎక్కాను. మువ్వల్లేవు దానికి. ఆ సాయంకాలం తెలిసింది, అతని భార్య పోయిందని.

అతను నాకుచెప్పలేదు. అహమ్మద్ అసలే ఉన్నతుడు! ఇప్పుడు వేదనాకిరీటంతో మరీ ఉన్నతుడై పోయాడు!



# మైలు రాయి



[గ్రాండు ట్రంకు రోడ్డుమీద ఇరవై మూడో మైలురాయి. పక్కనే కత్తిపాలెం సత్రం. సత్రంవరండు నిద్రగన్నేరు చెట్టు కొమ్మల మీదనుంచి మధ్యమధ్య ఒక్కొక్కకాకి అరుస్తూ ఉంటుంది, చాలాదూరాన్నుంచి లాగ. సత్రం అరుగుమీదనుంచి వినబడీ వినబడనట్లు ఏదో పల్లెటూరి రాగమో, తత్వమో వినబడుతుంది]

మగగొంతు

ఇరవై మూడు. అబ్బా! ఇంకా ఆరు మైళ్ళట్రా బాబూ! [వెళ్లిపోతూ అన్నట్లు]

మైలురాయి

ఇరవై మూడూ ఇరవై మూడూ! ప్రతివాళ్లూ ఇదే ధోరణి. ఇటు తిరిగిచూసినవాళ్లు కాస్త ఆగి పలకరించగూడదేం నన్ను? ఛీ, అరవై యేళ్లనుంచి చూస్తున్నాను. అసహ్యమా అని! వీళ్లకీ నాకూ దోస్తీ

'ఈ ఇరవై మూడూ' అంతే! కదల్లేనని కాని, ఇన్నాళ్లూ ఇక్కడ పాతుకు పోయి ఉన్నాను గదా, ఈ రోడ్డు నన్నుకాస్త పలకరించగూడదూ? నేనే పలకరిద్దామనుకుంటే, తాను ఇటో అటో పోతూండడమే కాని, ఒక్క చిటిక స్తిమితంగా నిలబడదు.

[దూరాన్నుంచి వస్తూఉన్నట్లు రెండు సైకిళ్ళ గంటల చప్పుడు]

మైలురాయి

[వెటకారంగా] అడుగో, నాయన దయచేస్తున్నాడు; మ్రరిపాడు మునసబు కొడుకు. రోజూ సాయంత్రం ఎవణ్ణో వెంటేసుకుని బుద్ధాపురం పోతూండడం, పొద్దున్నే యింటికి అఘోరించడం; ఇదీ వీడిపని. ఆ తండ్రిక్కొడుక్కాడు; ఆయనగారి సరసాలు సహం ఈ సత్రంలోనే జరిగేవి. ఈ త్రిపాదిగాడికి సైకిలోటి వచ్చిపడింది. కదల్లేక నే నేడుస్తుంటే, కాళ్లల్లో శనుండి వీడేడుస్తున్నాడు.

[దగ్గరగా వచ్చిన సైకిలు గంటలు]

మునసబు కొడుకు

ఈ మైలురాయొకటి బాగా దొరికిందిరా మనకి, కాళ్లెట్టు కోడానికి. నేనిక్కడుంటా.

స్నేహితులు

పీకెండి పోతూందిరా.

మునసబు కొడుకు

యేడిశావులే. మంచినీళ్లకెడుతున్నావా, మాలక్షమ్మతో మాట్లాడ్డానికి వెడుతున్నావా ?

[ఇద్దరూ నవ్వుతారు. ఇంతలో దూరాన్నుంచి]

గొంతుక

యేం సుబ్బమ్మా, చల్లుందా ?

మరోగొంతుక

గంప దింపనా ?

మునసబు కొడుకు

యేం సుబ్బమ్మా !

సుబ్బమ్మ

యేం బాబయ్యా !

మునసబు కొడుకు

బాబయ్యాలేదు, తాతయ్యాలేదు. కాని కాస్త...

సుబ్బమ్మ

యేంటయ్యా, కాత్తా కూత్తా...

మునసబు కొడుకు

ఆఁ మరేంలేదు, గంపదింపనా అని. సాయంచెయ్యనా ?...

సుబ్బమ్మా : సైకిల్ మీదొచ్చేస్తావేమిటి మద్రిపాడు?

[బయలుదేరుతున్న సైకిల్ గంటల చప్పుడు]

సుబ్బమ్మ

పో, పోవయ్యా. సిగ్గూ సిఁవడా లేకంతాను. [కొంచెం దూరంగా గంటలు] బుద్ధుండాలి.

మైలురాయి

బాగా బుద్ధి చెప్పింది. ఈ గొల్లసుబ్బమ్మకోసం పడిచావనివాడు లేడు. సత్రంగుమాస్తా, మీసాలపంతులు రఁపాటికి ఇక్కడ తయ్యారవ్వాలసిందే. గొల్లసుబ్బమ్మ నామీద కూచున్నప్పుడు నాకూ ఎంతో బావుంటుంది.

[సైకిల్ గంటలు మరీ దూరాన్ని]

సైకిల్ గంటలు ఎంత బాగా వినబడతాయి !... [దూరాన్నుంచి బస్సు హారనూ, హారన్నూ దగ్గరగా వస్తున్నట్లు. బస్సు ఆగే చప్పుడు]

కండక్టరు

ఏయ్ దిగండీ. జువ్విపాలెం, మద్రిపాడూ వెళ్లేవాళ్లు.

కోమటి

[లోపల్నుంచి] ఉండవయ్యా. కుక్కేశావు లోపల జనాన్ని. పద్దెన మండుగురికని పేరూ, నూటయాభై మంది నెక్కించావు.

కండక్టరు

అలా ఎక్కించం. ఇప్పుడా పప్పులుడకవయ్యోయ్. అంతా రూల్సు. సహం బస్సు నువ్వే కూచున్నావు. టాప్‌మీద పడేద్దాంవను కున్నాను అసలు నిన్ను. [అందరూ గొల్లున నవ్వుతారు]

పిల్లవాడు

అమ్మయ్యోయ్ [ఏడుస్తాడు]

ఆడగొంతు

ఎందుకురా ఏడుపు ?

పిల్లవాడు

షాహుకారు నాకాలు తొక్కేస్తున్నాడమ్మా.

కండక్టరు

దిగండి దిగండి !

షాహుకారు

హయ్యో హయ్యో ! నీ ట్రంకుపెట్టి వల్లకాదుగానూ. కణతకి తగిలిందయ్యా.

కండక్టరు

ఎక్కండెక్కండి. అప్పలపూడి, అమ్మలూరు, ఒంటిచింత, పెంటపుంత, పిచికపాడు, ఉడతలూరు, పిడతలూరు...

గొంతుక

పిడతలూరేంటయ్యా? [అందరూ నవ్వుతారు]

ఆడగొంతు

అటుకూచో అబ్బాయీ! ఇదేంవిటీ! మగాళ్ల సీట్లులేవా?

[బస్సు హారనూ, బస్సు దూరముగా వెళ్లిన చప్పుడు]

మైలురాయి

[నవ్వుతుంది] వాడికి మగాళ్ల సీట్లో కూచోవాలని లేందే... ఎలావచ్చి పడ్డాయి ఈ సైకిళ్లూ, బస్సులూ. వీటివల్ల సత్రంలో సందడి సహం తగ్గింది. మునుపు దొరలు, రాణులూ సవారీలలో వెళ్లడం, ఇక్కడ దిగడం ఉండేది. ఇప్పుడు వాళ్లూ బస్సులే ఎక్కుతున్నారు. షాహుకారు బస్సుమీద వెళ్లడమే బావుంది. లేకపోతే ఇక్కడాగి నామీద కాస్త చతికిలబడేవాడు... ఇంక ఈ రోడ్డుమీద ప్రయాణాలే ఉండవేమో?

[దూరాన్నుంచి 'టుర్రు టుర్రు' అనిన్నీ 'ఇటు పోదు ఇటు పోడేస్.' అనిన్నీ 'ఏ హై హేయ్' అనిన్నీ పశువుల్ని తోలుతున్నట్లు వినిపిస్తుంది. మధ్య మధ్య గేదెదీ ఆవుదీ దూడలదీ అరుపు, పశువుల మందవస్తున్నట్లు]

ఒక కాపు

రేపు శనోరం. పిట్టాపొరం సంత సూసుకుని, సోంవారం దావ్వారం సంత కెడదాం.

ఇంకో కాపు

మొన్న శనోరం పెద్ద గేది కెంతొచ్చిందీ ?

మొదటి కాపు

మూడొందలు.

రెండో కాపు

యడ్ల జతకో ?

మొదటి కాపు

ఎనిమిదొందలు. ఇంతా పుసుకుడుగాడు సెడదీశాడు...ట్లిక్ ట్లిక్. చొ్చ చొ్చ చొ్చ నడు నడేస్. ఒక్కొక్కటీ మైలురాయిని రాసుకుంటూ కదలదూ, హోరి... [వెళ్లిపోతారు]

మైలురాయి

ఛీ ఛీ వెధవ పేడా మన్నూ ! పశువులసంత వస్తుందంటే బాధ. ఒళ్లంతా బురదా, పేడా. అడుగో ఓవర్సీరొస్తున్నాడు ఇవాళ.

ఓవర్సీరు

బురదా, పేడా ఎప్పుడూ ఈ మైలురాయి నిండా. ఏయ్ వెంకన్నా, ఈ మైలురాయిగారిని కాస్త షోకు చెయ్యండోయ్ ! సున్నం గిన్నం కాస్త గట్టిగా తగిలించండి మొగానికి — ఆ ఇరవైమూడు బాగా కనబడేటట్లు.

వెంకన్న

సిత్తం.

ఓవర్సీరు

ఏమండీ సత్రంపంతులుగారూ! మిమ్మల్నే మహానుభావా! గుమాస్తాగారూ ! ఈ మధ్యాన్నం కాస్త సత్రంలో సాపాటు తగిలించమంటారా ఏమిటి ? ఘంటయ్యున్నాడా సత్రంలో ? మా మంచిపాకం !

గుమాస్తా

అయ్యయ్యయ్యో. ఎంత మాటా ! ఏది, తప్పకండా, సారి సారి ! ఏఁవోయ్ జాలయ్యా, ఏది, ఈవేళ ఓవర్సీరుగారి భోజనం ఇక్కడే. ఏం తెలిసిందా ? ఊఁ ఏది ?

జాలయ్య

చిత్తం.

గుమాస్తా

ఈ రోడ్డు మళ్లీ బాగుచేయిస్తున్నారు, ఏం విశేషం బాబూ ? ఆ రాధారీబంగళాకూడా, ఏది ...

ఓవర్సీరు

ఔనండీ, అది కాస్తా బాగుచేయిస్తున్నాము. ఈమాటు మంత్రి గారు ఈ తోవని వెడుతూ ఇక్కడ కాస్త దిగుతారేమోనని...

మైలురాయి

అబ్బ ! పొండవతలికి. ఒకడు 'ఏది' ఒకడు 'కాస్త' అంటూ. ఛీ వద్దు. ఆగు. నాకు సున్నం పుయ్యొద్దు. మంత్రిగారు కాస్త ఆగుతారేమో అనా, నాకీ అలంకారాలు? ఆ గంట్లు గంట్లు మొహమూ వాడూను, ఆ ఓవర్సీరుకి వేస్తే బాగుండును సున్నం ! మంత్రిగారికి కావాలా, నేను ఇరవై మూడునో, ముప్ఫయిరెండునో ? మొన్న బంగళాలో దిగిన కలెక్టరుగారి భార్య మొహానికి పూసుకున్నంత సున్నం పూశాడు. వెనకెప్పుడూ మంత్రులూ వాళ్లూ ఇలా పనిలేనట్లు తిరగలేదు.

[దూరాన్నుంచి దగ్గరగా వస్తున్నట్లు రెండెడ్ల బళ్ల గంటలు "సుబ్బా దాపకెద్దును పొడు" అనీన్నీ, "పక్కకు తోలుకెళ్" అనీన్నీ, "కారొస్తుంది కారొస్తుందీ" అనీన్నీ కేకలు. 'కారు హారన్' అనీ కొంచెం దూరాన్నుంచి బాగా వినబడతాయి.]

మగ గొంతుక

ఏయ్. బళ్లా ఆపండి. ఆపమనవోయ్ అప్పన్నా! ఆ ముందు బండి ఆపు. అందులో కూచునీ, వాడలా తోలించుకుపోతాడేం చిట్టిబాబు. ఒరేయ్ అప్పన్నా, అప్పిగా...

అప్పన్న

[నిదానంగా] అయ్యా !

బ్రాహ్మణుడు

ఏమిటీ అయ్యా ? అయ్యా కొయ్యాను ! పరుగెత్తు !

అప్పన్న

అయ్యా, ఓ ఓ ఓయ్, చింవాద్రీ ! ఆగో, నిలో, ఆపు బండి ఆపు. ఆగుండి బళ్ళోయ్ [బళ్లు ఆగుతున్న చప్పుడు]

బ్రాహ్మణుడు

ఏఁవ్రా, ఇక్కడ వంటలు పెడదామా వద్దా సత్రంలో ? యేవేఁ ముంగీ నిన్నే. ఉడతలూరు వెళ్లేసరికి మూడు జాము లవుతుంది.

బ్రాహ్మణి

అవుతే అవుతుంది. మరీ విడ్డూరం. ఇక్కడ కూచుంటే వంట లెప్పుడవనూ ? తిళ్లెప్పుడవనూ ? వెనక్కి, కాఁవిగాడి పెళ్లికీ అంతే. దోవలో ఇలాగే ఆగేమో సత్తెమ్మా ! రాత్రడిపోయింది. దోవలో దొంగలూ.

బ్రాహ్మణుడు

ఏడిశావులెద్దూ, ఊరికే జిగురు ఉపన్యాసం, జిడ్డులాగా ! అయితే బళ్లు నడిపించండోయ్. ఊఁ.

బ్రాహ్మణి

అదేఁవిటీ తొందరా. ఉండండయ్యో బళ్లా. మరీ బాగుంది. బళ్లాపించా లోకమాటు.

బ్రాహ్మణుడు

[దురుసుగా] ఎందు కాపడం ?

బ్రాహ్మణి

ఎందుకేఁవిటి ? ఎందుకో ! దిగవే సత్తీ. కాఁవమ్మా రండర్రా !

చిట్టిబాబు

ఏఁవండీ నాన్నగారూ, బళ్లెందు కాపారు ? ఈ బిడ్డు ప్రయాణానికి మజిలీ లెందుకండీ ?

బ్రాహ్మణుడు

ఉండరా నువ్వూ. పెళ్లికొడుకునని అన్నిటికీ నీ పెత్తనమేట్రా ?

చిట్టిబాబు

అందుకేనండీ నాలుగు బస్సులు కుదర్చమన్నాను. ఈ పాటికి హాయిగా భోజనాలయి కూర్చుని ఉందుం.

బ్రాహ్మణుడు

ఊరుకోవోయ్, కాస్త తగ్గూ ! వెర్రి వేషాలూ, షోకులూను ? బస్సులూ, ఏరోప్లేన్లూ కావాలి నీకు. ఉఫ్ అనగానే ఈ వేలిమీద

సున్నపుచుక్క ఆ వేలి మీదికి వచ్చినట్లు. ఇక్కడినుంచి అక్కడికి వాల్లేక పోయావా ?

బ్రాహ్మణి

అదికాదే సత్తెమ్మా. మేం కాఁవి మొగుడికి మూడు వెయ్యిన్నూట పదహార్లు పోశామా ?

సత్తెమ్మ

పోశారు కాదుటే.

బ్రాహ్మణి

ఆడబడుచు లాంఛనాలూ, పట్టు తాపితాలూ, వెండి కంచాలూ...

బ్రాహ్మణుడు

నీ మొహాలూ, సింగినాదాలూ, జీలకర్రలూ : ఎఖు. బండెక్క వే పెయ్యమ్మా.

మైలురాయి

ఏఁవి పిచ్చికోపం ఈ బ్రాహ్మడికి. పెళ్లయేలోగా యెన్ని యుద్ధాలుచేసి తిరిగొస్తాడో? వెనక ఇక్కడ సత్రంలోనే ఓ పెళ్లయింది. పెళ్లికూతుర్ని వెధవ ఆడబడుచుకి అప్పగించలేదని రామరావణ యుద్ధం అయింది. నామీదపడి తల బద్దలు కొట్టుకుంటానంది వియ్యపురాలు. నా కసహ్యం వేసింది. ఈ నెల్లో ఇది పదిహేడో పెళ్లిజట్టు. [దూరాన పెళ్లివారి బళ్లచప్పుడు వెళ్లిపోతున్నట్టు] హబ్బ, ఈ పెళ్లివారితో

ఉడతలూరు వెళ్లాలని ఉంది. ఉడతలూరుదగ్గర రోడ్డు ఆగిపోతుందిట. అక్కడ ముప్ఫయ్యో మైలురాయుందట. ముప్ఫయ్యో మైలురాయి ఎలా ఉంటుందో? ఈ పెళ్లి చూస్తుంది కాబోలు! [రెండు ఒంటెద్దు బళ్ల చప్పుడు. చక్రంలో కర్ర పెట్టి టకటకలాడిస్తూ మధ్యా మధ్యా పాడుతూ బండీవాళ్లు, దూరంనుంచి దగ్గర దగ్గరగా]

ఒక బ్రాహ్మణుడు

హాఁ హు! [మూలుగుతాడు] అబ్బ, కాళ్లడి పోతున్నాయి. ఏం దేవుడో కాని దిక్కుమాలిన దేవుడు, అప్పవరంలో ఏర్పాటు చేసుకున్నాడు ఈ కల్యాణమహోత్సవం. మరి తొమ్మిది మైళ్లు ఏడవాలి. [బండీచప్పుడు, పాట దగ్గరగా వస్తాయి] ఎవరు బాబూ అదీ, బండిలో? ఎవరు, తిరుపతయ్యా? ఏం తిరుపతయ్యా! ఎక్కడికీ ప్రయాణం?

తిరుపతయ్య

అప్పారం శాస్తుల్లుగారూ, దేవుడి కల్యాణానికి తీర్థంలో కొట్టెడదారని:

బ్రాహ్మణుడు

భేష్, పెట్టొద్దూ మరి. అన్నిటికన్న పెద్ద దుకాణం నీదే ఆయెనూ!

తిరుపతయ్య

సిత్తం.

బ్రాహ్మణుడు

తిరుపతయ్యా. కాస్త బస్తా ముందుకితోసి జరిగితే ఈ చివర్ని కొంచెం ఆనుకుని...

బండివాడు

ఎల్లండెల్లండోయ్ సాత్తుల్లుగారూ. మీ రెక్కితే మూడు బత్తాలవుతాయ్. కొత్తెద్దు కొనుక్కోలేను ఈ కరువురోజుల్లో. చొ చ్చొ చ్చో

[ బండి తోలేస్తాడు, చక్రాలు కొరడాకర్రతో చప్పుడుచేస్తూ ]

బ్రాహ్మణుడు

హారి నీ సిగదరగా ! హరి హరీ ! కాస్తసేపు ఇక్కడ ఆగుతా, ఈ మైలురాయి మీద ఒరిగి, సత్తెన్నారాయణ వచ్చేదాకా ! తోడుగా ఉంటాడు, అమాయికపు ముండాకొడుకు.

మైలురాయి

నా మీద ఒరగొద్దు. ఊఁ( [మూలుగుతుంది] అన్ని భోజనాల బరువు నేమొయ్యలేను. ఇదివరకు ఇలాగుండేదా ? దేవస్థానం ధర్మకర్త గారు సవారీలూ, బళ్లూ పంపించి వీళ్లని తీసుకెళ్లేవారు. ఈ శాస్త్రుర్లుగారు –జువ్విపాలెం శాస్త్రుర్లుగారు– ఆ కాశీపండితుడి కొడుకు. ఆయన పల్లకీ మీదినుంచి కింద అడుగుపెట్టేవాడు కాదు. ఈ సత్రంలో పాతికమంది శిష్యులతో దిగేవాడు. [కాకి అరుపు]

బ్రాహ్మణుడు

ఛీ! వెధవకాకి! హుష్! మీద రెట్టవేసింది. వెధవ కాకికీ, గద్దకీ కూడా నామీద కోపం అవుతే యెలా బతకడం? అదుగో సత్తెన్నారాయణ. సత్తెన్నారాయణా!

సత్యనారాయణ

ఇదిగో మాంవగారూ! అప్పవరమేనా?

బ్రాహ్మణుడు

అవునుగాని, మాంవగారేంవిట్రా? రోజుకో వరసా, వెర్రిముండా కొడకా! మగవరసలన్నీ అయాక, ఆడవరసలు కూడా మొదలుపెట్టి అత్తా పిన్నీ అని కూడా నన్ను పిలిచేటట్టున్నావు. ఇంద, ఈ మూట తీసుకో. ఇక్కడ ఓ అరగడియ కూచుని వెడదాం.

[దూరంనుంచి దగ్గరగా వస్తూన్న భజనమాటం పాట. మైలురాయీ, సత్రం దగ్గరకి వచ్చాక ఆపుతారు]

ఒక గొంతుక

ఆగండాగండి. తొరగా మంచినీళ్లూ అవీ పుచ్చుకురండి!

బ్రాహ్మణుడు

మంచినీళ్లూ, అవీ ఏంవిటోయ్?

మరోగొంతుక

నేను సత్రంలోకెళ్లి మీసాలపంతుల్ని సూసొస్తా.

ఇంకొకగొంతుక

ఏయ్, సెనగుండలూ!

బ్రాహ్మణుడు

ఏ ఊరోయ్ ఈ భజన, అమ్మిలూరిదా ?

ఒక గొంతుక

కాదండి, గోపాడదండి.

బ్రాహ్మణుడు

ఆఁ! గోపాడదే! ఓ! గోపాడది మా మంచికూటం! అప్పవరం తీర్థానికేనా వెడుతున్నారు?

ఒకగొంతుక

సిత్తం...రాండి, రాండర్రా, సాత్తుర్లుగా రింటారు. ఓ కీర్తన పాడి మరీ కదుల్దాం. రాండంటేనూ? సన్నాసీ, నువ్వు మొదలెట్టు కీర్తన.

సన్నాసి

[ముందు కొంచెం రాగంలా తీసి]

మేలైనా సిటికెనయేలూ, దాని
మీదా పొడిసిందిరా యెర్రతేలూ

ఒకగొంతుక

శా. అదిగాదురా. [అని తాను ఎడ్ల రామదాసుగారి కీర్తన మొదలెడతాడు. కాస్సేపు భజనచేసి, కూటం కదలి దూరంగా పాడుతూనే వెడుతుంది]

మైలురాయి

ఈ కీర్తనవింటే నా చిన్నతనం జ్ఞాపకం వస్తుంది. అప్పుడు అప్పవరం తీర్థానికి పాతికభజనలు ఈ తోవన వెళ్ళేవి. ఇప్పటి కీర్తనలే ఇంకోలాగ వినబడుతున్నాయి. నాకు ఇవీ బాగానే ఉన్నాయి. నాకు కదలాలని ఉంటుంది. నాకు చిన్నతనం పెద్దతనం యేఁవిటి ?

[జట్కాబండి చక్రంలో కర్ర టకటకలాడిస్తూ, దానితో కలిసి ఏదో సినిమాపాట వినబడుతుంది. బండి దగ్గరగా వస్తుంది]

బ్రాహ్మణుడు

ఏమోయ్ జట్కా, అప్పవరం తీసుకెడతావూ ? యిద్దరం !

మగగొంతుక

[జట్కాలోనుంచి] ఇద్దరం, ఒక్కరం లేదూ...

ఆడుగొంతుక

ఆ బ్రాహ్మడెక్కితే మనమిద్దరం ఆయన చెరో తొడమీదా కూచోవాలి.

[నవ్వుతారు. జట్కా వెళ్ళిపోతుంది]

బ్రాహ్మణుడు

ఏమోయ్ జియ్యన్నా, ఎక్కణ్ణుంచి? అప్పారం నుంచేనా?

జియ్యన్న

సిత్తం. మొక్కుండెళ్లాం. దింపవే వాణ్ణి కిందికి.

బ్రాహ్మణుడు

ఏం జియ్యన్నా, తీర్థం బాగా జరుగుతోందా?

జియ్యన్న

లేదండీ. తిళ్లులేక యేడుత్తుంటే తీర్థాలూ, తిర్నాళ్లూ యేఁవిటండీ! వొక్క బట్టల దుకాణఁవూ లేదు. రంకుల్ రాటాలు మాత్రం మూడొచ్చాయి. నిన్నరాత్రి జువ్విపాలెంవాళ్లు నాటకం యేశారు.

బ్రాహ్మణుడు

వొరేయ్, కుర్రకుంకా, వెనక్కి జరుగు; తగులుతావు.

జియ్యన్న

యెనక్కి పోరా. సాత్తుల్లగారి కడుపు తగులుతుంది.

బ్రాహ్మణుడు

మంచి సరసంగా ఉందే!

కుర్రాడు

నాన్నా! అది నిజం కడుపేనా ?

జియ్యన్న

ఏడిశావ్ ! నోరుముయ్ యెదవా. బాబూ! తీర్థంలో బుట్టబొమ్మలు జూసి యెదవపెశ్నలు! బాబూ, మా చంటోడికి అక్కడ జెరం వొచ్చింది. కొంచెం నీళ్లూ, ఈబూతీ యిచ్చారంటే కాస్త...

బ్రాహ్మణుడు

నీ దగ్గర కుంకం, పసుపూ, కొబ్బరికాయా ఉన్నాయా? యేఁవమ్మా!

జియ్యన్న

సిత్తం.

బ్రాహ్మణుడు

ఒక రూపాయి ఇలాతే. [ఏదో మంత్రం అంటాడు] ఈ మైలు రాయిలో ఇదివరకే అమ్మవారు వెలిసింది జియ్యన్నా! సూకాలమ్మ! యెవ్వరికీ తెలియదు. ఊఁ. దీనికి పసుపూ కుంకం పట్టించమ్మా. జియ్యన్నా, ఏదీ కొబ్బరికాయ? చూడు. ఇక్కణ్ణుంచి మైలురాయితల్లికి ఒక గుడి చిన్నతీర్థం తయారవుతాయి. [మైలురాయి తలమీద కొబ్బరికాయ కొడతాడు]

మైలురాయి

[బాధతో] వొద్దురోయ్. నేను దేవత నవను. [కెవ్వున కేక వేస్తుంది]





# బూట్ పాలిష్

వేల శతాబ్దుల వ్రేగులవల్ల వంగిపోయి
విశేష భూమీధారం క్రింద క్రుంగిపోయి
అణగిపోయి
అణగిపోయి
అహరహమూ నేలవైపే అదేపనిగా చూస్తూ
నాగలిపైన బరువుగా ఒరిగో
గొడ్డలి బుజాన వేసుకునో
నిలబడతాడతడు.
యుగయుగాల శూన్యమేదో అతని
మొగంలో స్ఫురిస్తుంది

ఆనందమూ, నిస్పృహా అన్నవి
అసలేమీ ఎరుగని జడుడాతడు.
ఏడవలేడు, కన్నీరోడవలేడు
ఆశపడలేడు, ఆహ్లాదపడలేడు
కొయ్య, రాయి, ఎద్దు
వీటికి తోబుట్టువా అనిపించేటట్లు.
వాని ఫాలం అంతా అర్థరహితమయ్యేటట్టు
వేని చేయి తుడిచివేసింది?
వాని మనస్సులో వెలుగు
వేని ఊర్పు ఆర్పింది?
వానికి చేతగాదు చుక్కలవైపు చూపుల్ని పరపించడం.
అమృతగానంలో ఆరోహణావరోహణాలు
అతనికి అపరిచితాలు.
ఉషఃకాంతి రేఖ, సంధ్యాసమయారుణిమ
ఏమీ పట్టించుకోడాతడు.
బాధామయ శతాబ్దులు, వాని
భయదమూర్తిలో తొంగిచూస్తాయి.

వంగినవాని బుజంలో
కాలపురుషుడు రచించిన దుఃఖాంత నాటకం
కనబడుతుంది.
వానిని మనం దగాచేసినట్లు, దోచుకున్నట్లు
మలిన పరచినట్లు
వాని వారసత్వం పోగొట్టినట్లు
అనిపిస్తుంది నాకు.
అయ్యా! అధికారులూ! ప్రభువులూ! పాలకులూ!
ఆ భగవంతుని కిదా మనమర్పించుకునే ఉపద?
ఆ వంగిన నడుమును ఏలాగున సరిజేస్తారు మీరు?
ఆ క్రుంగిన బుజం ఏలాగున నిలబెడతారు మీరు?
వేరు నేర్పుతారు వానికి వెలుగుకోసం పైకిచూడడం?

ఇది, నేను చదివిన ఒక ఆంగ్లపద్యం సారాంశం.

౨

నారయ్య తరుచు మావీధిని వెడుతుంటాడు. వట్టిపోయిన ముసలి గొడ్డో, మరి పనికిరాని ముసలియెద్దో ఎప్పుడైనా మావీధిని వెడుతుంటాయి. వాటిదీ నారయ్యదీ ఒకటే వాలకం; ఒకటేజాతి.

నారయ్య బుజాలు — కాదు నడుము — రవ్వంత వంగి ఉంటుంది. ఆ వంగడం బరువుమోతవల్ల కాదు. నారయ్య నడుస్తున్నప్పుడు కాళ్లీడుస్తాడు. ఆ కాళ్లీడవడం అలసటవల్ల కాదు.

రోలరులాగుతూ రోడ్లు బాగుచేస్తారే వాళ్ల కాళ్లు కంకరమీద ఏడు స్థాయి కూడా.

నారయ్యది వంగిననడుంవాళ్ల జాతి. కాళ్లీడ్చేవాళ్ల జాతి. అంతే.

ముసలియెద్దుకీ గొడ్డుగోవుకీ చుట్టాలులేరు. నారయ్యకి పెళ్లాం పిల్లలూ ఉండడం వింతగా ఉంటుంది.

"నారయ్యా, నీకు వయస్సెంత ?" అని అడిగాను మొదట. "అదేమిటో" అన్నాడు. "నీకెన్నేళ్లుంటాయ"ని అడిగాను మళ్లీ. "నాకెలా తెలుస్తుందండీ ?" అన్నాడు.

ప్రత్యేకవ్యక్తికీ, ప్రముఖునికీ వయస్సుంటుంది. వాడు పుట్టి, పెరిగి, కొన్ని పనులుచేసి, చచ్చిపోతాడు. ఆజన్మాంతం వాడిజీవితం తేదీలమీద తారీఖులమీద అడుగువేస్తూ నడుస్తుంది. మందికిమాత్రం వయస్సుండదు. అజ్ఞాతజనానికి చావు పుట్టుకలుండవు.

లోకమందిరానికి పునాది, కోట్లమంది సామాన్యజనం. సౌధభారం మోసే పునాది మనకి కనబడదు ; కాని ప్రాసాదసౌందర్యం చూసి బలే అని కనుబొమ తెగరేస్తాం. అంతే అది ; లోకపద్ధతి.

కనక, మనకి కోట్లమంది జనంలేరు. అంచే వాళ్లండిన్నీ మనకి లేరు. వాళ్లు లేనప్పుడు మనకి భగవంతుడుగూడా లేడు. కవి ఇలాగన్నాడు.

"ప్రభూ! ఇక్కడ నీ చరణపీఠంఉంది; ఇక్కడ దరిద్రులూ పతితులూ విడిదిచేసేచోట, నీ పాదాలు ఉన్నాయి. ఎంత వంగి వంగినా, నా ప్రణామం నీ పాదాల్ని అందుకోలేక పోతుంది; అవి దరిద్రులూ, పతితులూ విడిదిచేసేచోట ఉన్నాయి. చిరిగిపోయిన గంతలూ బొంతలూ వేసుకుని, దీనవేషివై నీవు దీనులతో తిరుగుతావు; నా అహంకారమక్కడికి చేరలేదు. ఏ సహచరులూ లేని దిక్కుమాలినవాళ్ళతో సావాసంగట్టి తిరుగుతావు నీవు. స్వామీ! ఆ చోటికి తీసుకుపోయే దారేదో నా హృదయాని కెన్నడూ తెలియదు."

ఈ కవే మరోచోట అంటాడు. "నీ కాషాయాంబరాలూ, ఆడంబరాలూ కట్టిపెట్టు. జపమాలిక త్రిప్పడం, నామభజన చేయడం చాలించు. అతని దగ్గరకు పోవాలంటే – అడుగో, ఆయనక్కడ ఉన్నాడు; రాళ్ళుకొట్టి దార్లు వేసేవాళ్ళతోనూ, కటికనేలను దున్నేవాళ్ళతోనూ. ఈ చీకటిగుడి తలుపులు వేసుకుని ఇక కూర్చోకు. Meet him and stand by him in toil and in sweat of thy brow."

౪

శిథిలాలయమ్ములో శివుడు లేడోయి
ప్రాంగణమ్మున గంట పలుకలేదోయి
దివ్యశంఖము గొంతు తెరవలేదోయి
పూజారి గుడినుండి పోవలేడోయి

చిత్ర చిత్రపు పూలు చైత్రమాసపు పూలు
ఊరూర, ఇంటింట ఊరకే పూచేయి
శిథిలాలయమ్ములో శిలకెదురుగా కుసుక
పూజారి కొకటేని పువ్వు లేదోయి
వాడ వాడల వాడె, జాడలన్నిటవాడె
వీడు వీడున వాడె, వీటి ముంగిటవాడె
శిథిలాలయమ్ములో శిలకెదురుగా కుసుక
పూజారివానికై పొంచియున్నాడోయి

*

అన్నిరకాల అహంకారాలలోనూ చెడ్డదేదంటే ధర్మసంబంధమైనది, నీతి సంబంధమైనది; అంటే 'నా అంత' భక్తుడులేడు నా అంత ఋజువర్తనుడులేడు. అనుకోవడం. ఇట్టి అహంకారులు భగవంతునికి మరింత దూరంగా ఉన్నారు. అలాగే నేను సంఘసేవ చేస్తున్నాను, మరో సేవ చేస్తున్నానంటారు కొందరు. ఈ బడాయి కూడా దావుండదు. "He who wants to do good knocks at the gate. He who loves finds the gate open."

దరిద్రుల దగ్గరను, శ్రమజీవుల సమీపాననూ - అక్కడమాత్రమే కాదు - భగవంతుని వసతి. లోకం బహిష్కరించిన వాళ్ళ మధ్యనూ పతితుల నడుమాకూడా భగవంతుడుంటాడు. వాళ్ళను వదల్లేడు. God is a long-suffering God.

౬

నారయ్య చెప్పులజోళ్ళు కుడతాడు. అంటే పాతజోళ్ళను మరమ్మతు చేస్తాడు. అంటే మాసికలూ అవీ వెయ్యడం, చిరుగుల్ని కలిపి కుట్టెయ్యడం, ఇలాంటివి చేస్తాడు. జోళ్ళకు పాలిష్ గూడా వేస్తాడు.

ఒకనాడు మా వీధివెంట వెడుతున్న నారయ్యను పిలిచాను. పిలిచి చెప్పులజత ఒకటి వానిముందు పడేశాను. 'పక్కన కొంచెం ఊడిందీ, కలిపి కుట్టెయ్యాలీ, తరవాత పాలిష్ చేయాలీ' అన్నాను. 'ఆఁ' అన్నాడు తలెత్తకండానే.

కాని నేను తీయమన్న చెప్పులజత తీయలేదు నారయ్య. పక్కనే ఇంకో చెప్పులజోడుంది. దాన్ని తీశాడు. దానికి రిపేరుకావాలని నేననుకోలేదు.

అలాతీసి, పక్కల్ని గట్టిగా విడదీసి చూసి, దబ్బనంతో పొడిచి చూసి, వేళ్ళని ఆ సందులోనికి పోనిచ్చి పెకిలించి లాగిచూసి, అదివరకు లేని చిరుగుల్ని ఇప్పుడు బయటపెట్టి 'ఈ చెప్పులో?' అన్నాడు తలెత్తకండానే.

నాకసహ్యంవేసింది. 'ఆ జోళ్ళక్కడపెట్టి అవతలికిపో. నాకు ఏజోడూ రిపేరు చేయొద్దు' అని గద్దించేలోగా, అసలు చెప్పులజతను తీశాడు; తలెత్తకండానే.

ఏంజేయను నారయ్యను? దానికున్న చిన్న చిరుగుల్నిగూడా పరామర్శించి, అడుగు అట్టకీ పై తోలుమూతకీ సంబంధం లేనంతదూరం

చేశాడు. ఇక నేను వీధిలోకి వెళ్ళాలంటే ఏదో చెప్పులజత బాగుచేయించి తీరాలి. నా అనుమతి తీసుకోకండానే నారయ్య సంచీ విప్పాడు. తాళ్ళూ, తోలుముక్కలూ, పాతచెప్పులూ అవీ అవతల పారేశాడు. తోలుకోసే కత్తివంటిది తీశాడు. సూదో, దబ్బనమో, అది తీశాడు. తోలు తడిపాడు. చెప్పులకు అంటిపెట్టి చూసి, అనుకూలమైన సైజుల్లో ముక్కలు కోశాడు. కోసి, చెప్పులలో అతుకులూ, తాను పెకలించి విడదీసి తయారుచేసిన భాగాలూ కుట్టడం మొదలెట్టాడు. తరవాత, నేను కోరలేదూ, నన్నడగలేదూ, రెండోజతగూడా మరమ్మతు చేశాడు. ఆ తరవాత, ఏదో ఎఱ్ఱ మందున్న డబ్బాతీసి చెప్పులకు రుద్దాడు. బ్రష్‌పెట్టి తోమాడు. నిగనిగ మెరిసేలాగ చేశాడు. ఇదంతా తలెత్తకండానే.

నారయ్య తలెత్తి పైకి చూడడం ఎరగడనుకున్నాను.

ఇక నారయ్య కేం ఇవ్వను? ఎంతోపని ఎంతోసేపు చేసినట్లనిపించింది నాకు. అంతపనీ నేను కోరుకోలేదని గూడా తిక్కగా ఉంది. నాకు తోచిన డబ్బులు పడేశాను. అప్పుడు నారయ్య తలెత్తాడు. నాకేసి చూశాడు.

నారయ్య చూడగలడే? నారయ్యకళ్ళు ఇంకా ఆరిపోలేదు. తరవాత నాకేసి చూస్తూనే ఓ చిన్న నవ్వు నవ్వాడు. నవ్వడంగూడా చేతనవును నారయ్యకి.

నాకు కొంత కలతా, సిగ్గు గూడా వేసింది. 'ఏమివ్వమన్నావు?' అన్నాను. 'నీ వడిగిందేయిస్తే కొత్తచెప్పలే కొనుక్కుందునే' అన్నాను.

'కొత్తయీ కొనండయ్యా మారాజులు! తరవాత అయీ బాగుజేస్తా' అన్నాడు. నారయ్యకి కావలసిన డబ్బులిచ్చేశాను.

డబ్బులు పుచ్చుకుని లేచిన నారయ్యని కూచోబెట్టాను. మాటల్లోకి దింపాను. అతనికి కొడుకూ, కూతురూ ఉన్నారు. కొడుకు బడికి వెడుతున్నాడు. ఎలా పంపగలుగుతున్నాడో వాణ్ణి మరి? నారయ్య ముసలితల్లి బతికి ఉంది. రోజూ ఎంతోకొంత గడిస్తాట్ట. అప్పుడప్పుడు అంత రానూ రాదన్నాడు. మరప్పుడు తిండో అన్నాను. నిర్లక్ష్యంగా చప్పరించి, పట్టుకొస్తే తింటాం, లేకపోతే పండుకుంటాం అన్నాడు. ఆ మాటల్లో కసి లేదు. వాటిలో బరువూ బాధా గూడా లేదు. ఎప్పుడైనా సినీమా చూశావా అన్నాను. మళ్లీ చప్పరించాడు. "ఊః, రెండుమూడుసార్లు. అది గూడా చూసింది. పిల్లలకి బలే సరదా, సినిమా అంటే" అన్నాడు. ఒక స్థలం పేరుచెప్పి, అక్కడో చిన్న పాతగుడిసెలో కాపరం ఉన్నానన్నాడు. అది నా పాతజోడులా ఉంటుందనుకుంటా; చిరుగులూ మాసికలూ అదీ.

'నారయ్యా, ఈపని నీకు బాధగా లేదా?' అన్నాను. నారయ్య చిన్న నవ్వు నవ్వి, ఆ నారాయణమూర్తే అన్నిటికీ అన్నట్టు పైకొక్కసారి చూశాడు.

౨

భక్తుడు రామ్‌దాసు జోళ్లు కుట్టేవాడు. అతనిలా పాడతాడు.

"భగవంతుడు జోళ్లు కుట్టేవాడు
గొప్పగా కుడతాడు

పగలూ రాత్రీ కుడతాడు
సూర్యుడు బంగారు పాదరక్ష
వెండి పాదరక్ష చంద్రుడు.
నీలాల గదిలో, స్వర్గంలో
నిశ్శబ్దంగా కూర్చుని
నిశాదివాలు చెప్పులు కుడతాడు.
ఈలోకం పాతబడిపోయిన అతని పాదరక్ష
అయితే అతని అడుగు
అతి తేలికగా పడుతుంది దానిమీద.

భగవంతుడు రజకుడు. నిశ్శబ్దంగా నా బ్రతుకూ నీ బ్రతుకూ మాలిన్యం పోయేట్టు ఉతుకుతాడు. భగవంతుడు బట్టలకు రంగులు వేసే వాడు గూడా. సందె వన్నెలను తెచ్చి మన బాధలకూ, ఉషఃకాంతులను తెచ్చి మన ఆనందాలకూ అద్దుతాడు. మొదటే చెప్పానుగదా-భగవంతుడు రాళ్లుకొడతాడు, పొలం దున్నుతాడు.

౮

చెప్పులకు పాలిష్‌వేసే కుర్రవాళ్లలో ఆలీ ఉన్నాడు; అందమైన కళ్లూ వాడూను. వాడు బజారు రోడ్లో కనబడతాడు. తరుచు సినీమా పోస్టర్లు చూస్తుంటాడు. రైలుస్టేషన్‌లో నారాయణ ఉన్నాడు. వీడు కంపార్ట్‌మెంటల్లోకి జొరబడి పాలిష్ వేస్తుంటాడు.

నారయ్య కొడుకు మాత్రం చెప్పులు కుట్టడు, పాలిష్ వెయ్యడు. చదువుకుంటున్నాడు. పాతచెప్పువంటి నారయ్య గుడిసెకు ఎప్పటికైనా వాడే మాసికలు వేయాలి.





# అవ్వ బస్సు ప్రయాణం

నా ఆయుర్దాయంలో సహం నమిలి మింగేసింది అవ్వ. సుబ్బమ్మవ్వ. అయితే, ఆ ముసిల్దాన్ని నువ్వొదిలించుకోలేక పోయావా అనంటావేమో! అలాంటి బోడి ప్రశ్నలు నా దగ్గర కట్టిపెట్టు. మీ సావిట్లో వుందీ, మీ తాతయ్య పడుకునే ఆ వెడల్పాటి బల్లా, వొక్కాలు విరిగితే మళ్ళీ పెట్టించావూ. అది నువ్వొదులుకోలేవు, అవ్వన్నేను వొదులుకోవాలా?

నిజానికి ఆవిడమీద కోపం వొచ్చినప్పుడు మాత్రం, "అరెరే ఆ బ్రిటిష్‌వాళ్ళు సహగమనం మాన్పించేశారే! లేకపోతే అవ్వ అవ్వలాగ ముదరకండానే వెళ్ళిపోయుండేదే!" అని అనిపించడం కద్దు. కాని యింతకూ అవ్వ ఉండిపోయింది. అంతే, ఉండిపోయింది!

ఇంతకూ అసలుకొస్తాను.

కొప్పులూర్నించి కోదండమావ(య్య దగ్గర్నించి వుత్తరం వొచ్చింది. అతని రొండో కూతురు పార్వతి పెళ్ళనీ, పెళ్ళిపనులూ అవీ చేయడానికిన్నీ, మిగిలిన యేర్పాట్లకీ సహాయంగా వుండడానికిన్నీ పది రోజులు ముందే రమ్మని.

సరే అని పెట్టేబేడా కట్టుకున్నాం; ఇల్లూ వాకిలీ సద్దుకున్నాం. కాం(వి గాడికీ, గోవిందుకూ కబురుచేసి.

"యామ(రోయ్, జాగర్త. తెల్లమొహాలువేసి కూచోకండి. పెరట్లో ఆవుని జాగర్తగా చూడండి. యింట్లో అవ్వని వొదిలేస్తున్నాం. ఆవిణ్ణి కాస్త కనిపెడుతూ వుండండి, పాపం" అని అంటూ...

"అవ్వేదర్రా?" అన్నాను.

"ఇందాకా వొంటింట్లో గూడూ అవీ సర్దుతున్నారు" అంది మా ఆవిడ.

"ఇక్కడున్నారయ్యా" అని బండిలో సాం(వాను సర్దుతున్న గోవిందు వీధిలోంచి అరిచాడు.

వీధిలో అరుగుమీద అవ్వ కూచునివుంది, ఓ మూటా, చిలకల మానిక చెంబూ, చిన్న తాటాకుబుట్టా, పక్కని పెట్టుకుని.

"యేం(విటవ్వా యిది యెక్కడికి?" అన్నాను.

"కొప్పులూరికి రా" అంది.

"కొంప మునిగింది" అనుకున్నా. గుండె అరికాల్లోకి జారి పోయింది. "యిలాంటి వేసంకాలంలో, తొంభై యేళ్ళదానివి, ఈ ప్రయాణ సన్నాహం యేవిఁటి? పేద్ద ఆఫీసర్‌లా పెట్టేబేడా కట్టుకుని! బండీ, బస్సూ, రైలూ యిన్ని యెక్కి యేడవాలక్కడికి.

"నీ విభూతిపండూ, వొత్తులుపెట్టీ లేకపోతే వివాహం ఆగిపోదు. టుప్పుమంటే దారిలో, కొవ్వూరు వెళ్ళడం వుండదిహ. అక్కడే ఆవలించావంటే అన్నీ తగలడతాయి" అంటూ ఉరిమాను. చిన్న మందహాసంతో, అవ్వ నిదానంగా "అదేవిఁట్రా అబ్బాయీ! నేన్రాకండా కోదండం కూతురుకి పెళ్ళి చేస్తార్రా? నేను రాకపోతే వాడిచెయ్యి విరిగినట్టవదూ! వెధవ్వాళ్ళకి వేరే వంటలుగదా. అవన్నీ యెవరు చూస్తార్రా? కలకల్లాడుతూ కోదండం శుభమల్లే పెళ్ళి చేసుకోడవేఁవిటి? టప్పుమంటావు, టుప్పుమంటావు అంటూ అఘాయిత్తెం మాటలేఁవిట్రా? మళ్ళీ మళ్ళీ చూస్తానురా యిదీ?" అంటూ మా ఆవిడవైపు తిరిగి "యేఁవే అమ్మాయీ, 'బంతులాడా రావే, బాలీకామణిరో' ఆపాటొచ్చునే నీకు? అక్కడ పాడాలే. అదిన్నీ, ఆమధ్య పాడావూ, "అవిటికాలు వియ్యపురాలదిగో వచ్చెనూ..."

నాకు చిర్రెత్తుకొచ్చింది.

ఆవిణ్ణి లోపలికి మూటతోసహా విసిరేసి తలుపేద్దాఁవనుకున్నాను. కాని, అవ్వ సంగతి మీకు తెలియదు, సుబ్బమ్మవ్వ సంగతి. ఆవిడకో భయంకరఁవైన ఆయుధం వుంది. నే చెప్పానిదివరకే మీతో. పై పెదవి

కింద వొకేపన్ను వుందని. అదీ మన్ని యేడిపించాలను కున్నప్పుడూ, తనకు పట్టుదల వొచ్చినప్పుడూ, దానికింద అంటే ఆ పన్నుకింద నాలిక పెట్టి ఆడిస్తుంది. మన్ని చూసి యెగతాళిగా తలాడించినట్టూ, నువ్వేం చేస్తావు, చూస్తాను అన్నట్లూను.

ఆరోజున, ఆ క్లిష్టసమయంలో భయంకరమైన ఆ పన్ను ఆడింపు చూశాను.

ఏమీ చెయ్యలేక, "గోవిందు వెధవా, సామాను సద్దావోయ్" అని కేకేశాను.

"వాడు తిట్టాడని యేమీ అనుకోకు గోవిందూ, పిచ్చికోపంగానీ మనస్సు మంచిది" అంటూ బండిదగ్గర కెళ్ళింది అవ్వ.

'అవ్వకీ జెయ్!' అని మా నానిగాడు చెయ్యందించాడు. కొవ్వూరికి బయలుదేరాం.

కొణితివాడ బస్సుస్టాండు దగ్గర బండిదిగాం. అందాకా తోవపొడుగునా అవ్వకీ యెడ్లకీ తీరికలేదు. అవి బండి లాగాలాయె, ఆవిడ పెళ్ళి ముచ్చట్లమీద ప్రెసంగం చేయాలాయె.

కొణితివాడలో బస్సప్పుడే సహం నిండిపోయింది. దడదడ సామాను బస్‌స్టాప్‌మీద వేయించి, పిల్లల్నీ ఆడాళ్ళనీ బస్‌లో కెక్కించాం. అందరూ కూచున్నారు.

అవ్వ ఓ షావుకారుంటే "కాస్త జరుగుబాబూ" అనడిగింది.

అతను వినిపించుకోనట్టు యేదో మూలిగాడు.

"యేంబాబూ మూలుగుతున్నావు పాపం? కాస్త జరుగు నాయనా!" అంది అవ్వ.

అతను బస్సు కిటికిలోంచి చూస్తూ తిక్కగా దగ్గాడు. కాని జరగ లేదు.

షావుకారు, యెత్తు కన్నా వెడల్పెక్కువ. మాప్‌లో ఆస్ట్రేలియా వుంటుందే, అలాగుంటాడు. నిజానికి ఓపట్టానికి జరగడంకూడా కష్టం.

వేసంకాలం, కానీ షావుకారు వర్షాకాలం మబ్బులాగున్నాడు, నల్లగా చెఁవటలు కురిపించేస్తూ. అతని పంచా, చొక్కా వొంటికి అంటు కునిపోయి వొలిచేదానికి మాత్రఁవే వీలుగావున్నాయి. కాని అవ్వకి మాత్రం అతనిమీద జాలికలగలేదు. ముందు పన్నాడించడం మొదలెట్టింది. కళ్ళు మెరవడం మొదలెట్టాయి. వొక విషపునవ్వుతో పెదిమలు వొక పక్కకి వొరిగించింది. చెప్పలేనంత చల్లగా నిదానంగా నానిగాణ్ణి జరిగించి వాడిపక్కని కూచుంది, అంటే షావుకారుకు సరిగ్గా ఎదురుసీట్లో.

"యేవూరు బాబూ షావుకారూ" అని అడిగింది.

అతను జవాబు చెప్పలే.

ఒక చిటికాగి, "పేరేఁవిటి బాబూ" అంది.

అతను 'ఫో' అన్నట్లు తల పక్కకి టొకాయించి వూరుకున్నాడు. "వద్దులే, చెప్పొద్దులే, ఆ గొంతు కెలావుంటుందో అని. పిల్లలుగూడా వున్నారు" అని గారాంగా మూతిపెట్టింది అవ్వ.

ఇక్కడోమాట. అవ్వకు కొన్ని ఆయుధాలున్నాయి. ప్రెశయం వైనవి. అశ్వత్థామనారాయణాస్త్రంలాగ! వాట్లో వొకటి ముందు పన్ను. అదిసరే. రెండు దొంగ సాంవెతలూ అవీ చెప్పడం, అబద్ధపు కథలు తన హయాంలోనే తన ఖుద్దునే జరిగినట్టు చెప్పడం. మూడు, అతి ఒడుపుగా అన్నీచూస్తూ, గమనిస్తూ మందమతిలాగ మగతలో ఉన్నట్టు నటించడం. అసలు అవ్వకి వీపుమీద కూడా కళ్ళున్నాయి. ఇహ ఆఖరిది, ముసల్ది ఆడదీ అవడం. దీనివల్ల ఎవరూ ఆవిడమీద చెయ్యి చేసుకోరుగదా.

ఇలాగ ఆరోజు బస్సులో షావుకారు కెదురుగా కూచుని అవ్వ మొదలెట్టింది బాబూ, యుద్ధ ప్రెసంగం.

చూడండీ యెలకపిల్లతో పిల్లి ఆడుకుంటుందే, అలాగా షావు కారుతో చెలగాట మాడేసింది. వట్టి ఒంటిపన్నుతో, వూటలాగ వూరే మాటలతో చేసింది యుద్ధం.

''బాబూ, పేరు చెప్పొద్దమ్మా, వొద్దులే, తెలుస్తూనే వుంది రాదూ. ఎంచక్కా 'హనుమాన్లూ' అని పిలవనా? నా బిడ్డవంటివాడవు నాయనా! 'హనుమా' అని కూడా అంటాను ముద్దుగా.

''బాబూ, నువ్వు పాపం పేరుచెప్పలేదంటే, చెప్పనూ లేవు. పాపం, ఎక్కణ్ణించో రావాలి ఆ దిక్కుమాలిన మాట, మడతలన్నీ వొత్తి గించుకుని. చూడయ్యా, రోజూ కాస్త తేనె పుచ్చుకోగూడదూ రొండు పూట్లా? తేనెపుచ్చుకోడం, పప్పులూ వేపుళ్లూ మానెయ్యడం, అంతేనోయ్'.

షావుకారు వుగ్రంగా చూశాడవ్వకేసి.

అవ్వ మళ్ళీ—

"నీ కిష్టంలేమా అల్లాచెయ్యడం? అవును మరి. తిండిమానుకోడం కష్టం. నాలికెని చంపుకో లేనపుడు. లోపల బోలెడంత చోటున్నపుడు ఎందుకు మానుకోడం అనిపిస్తుంది."

ఇక్కడి కొచ్చేసరికి బస్సులో పిల్లలూ వాళ్లూ మొదట నోట్లోకి చెయ్యిడ్డెట్టుకుని "ఛు ఛు ఛు" అని నవ్వాపుకుంటూ నవ్వడం మొద లెట్టారు. అవ్వ సూటిగా, నిదానంగా షావుకారుకేసి చూస్తూ ప్రెసంగం సాగిస్తూనేవుంది.

"మా రావయ్యకాపు కొడుకు వీర్రాజు కూడా యిదే చెప్పాను బాబూ. నువ్వు వీర్రాజు నెరగవను కుంటాను. నేను, నానిగాడు తిరనాళ్ళ కెళ్ళేప్పుడు మేం బండిలోంచి పడిపోకండా, వీర్రాజునే చివర్న బిరడా లాగా బిగించాడు మా అబ్బాయి.

"ఇంతకీ నే చెప్పేదేవంటే, ఆ వీర్రాజు కూడా నే చెప్పింది వినక, వొళ్లుపెంచి యిటూ అటూ దుర్రాక్రవణం చెయ్యడం మొద లెట్టాడు. ఐతే యిలాగ చూడు నాయనా! అతని వొళ్ళు, అతగాడి వొంటిరంగు మంచిదోయ్. నీవొళ్ళులాగే నిగనిగలాడుతూ, నల్లహా, కొత్తతారురోడ్డులాగా, నిగనిగలాడుతూ. మన మొహం చూసుకోవొచ్చు తెలుసునా? నల్లటి అద్దంలాగ. మా నానిగా డంటూంటాడు కూడాను,

మరి సిరా కావలిస్తే వీర్రాజు వొంటి మీద యిన్ని నీళ్ళుపోసి తీసుకోవచ్చని.

''అయినా వీర్రాజుకి అంత వొళ్ళు అనవసరమున్నా అపదా కూడాను. ఎందుకు? ఒక సంగతి జరిగాక, రాఁవయ్యకాపుతో చెప్పా కూడా. ''తగ్గించు రాఁవయ్యకాపూ, తగ్గించు వీర్రాజు విస్తీర్ణం'' అని.

ఓసారి యేమయిందంటే,

తెల్లారగట్ల, నాలుగ్గంటలకి, రాఁవయ్యకాపు యింటిదగ్గిర్నుంచి 'గొల్లు' మని యేడుపులు, కేకలు వినబడ్డాయి.

మేం పరిగెత్తాం వాళ్ళింటికి.

వాళ్ళ సావిట్లో వొణకచుట్టూ బొద్దెంకల్లాగ వీర్రాజు చుట్టూ యింట్లో నలుగురూ చేరి...

''ఏఁవిరా నాయనా, ఏఁవిరా, మాటాడరా? సద్దుకున్నావా?'' అన డుగుతున్నారు. దూరాన వో మూల వొణుకుతూ పశువులు తోలుకుపోయే గొల్లాడు వెంకటయ్య నిలబడి వున్నాడు. మేం వొచ్చాక, వీర్రాజుని వెల్లకిలా పడుకున్నవాణ్ణి, రాఁవయ్యకాపూ వాళ్ళూ, ఏడెనమండుగురు పక్కకి ఒత్తిగించారు. అటు పడిపోకండా చిన్నపీటలూ అవీ పెట్టేరు. చూద్దుంగదా, వీర్రాజు వీపుమీంచి, చేతులుమీంచి మూడు ఎర్రవారలు బొబ్బలెక్కి వున్నాయి.''

''ఇదేమిటి?'' అన్నా.

"తెల్లారగట్ల నాలుగ్గంటలకి వీ(రాజు పెరట్లో పశువుల పాకదగ్గిరకి వెళ్ళాట్ట, పశువులకి గడ్డేద్దాంవని. ఇంతలో పిచ్చివెధవ గొల్ల వెంకటయ్య వొచ్చి వీ(రాజుని మలపగేదనుకుని గడ్డిమీద వొంగున్న వీ(రాజుని 'చ్చొ చ్చొ చ్చొ' అని వీపుమీద తాటితో మూడుసార్లు తగిలించాడు గట్టిగా.

''రేచీకటి వెధవ. ఎంత చీకటైనా, బక్క-చిక్కిన గేదెకీ వీ(రాజుకీ తేడా తెలుసుకోవొద్దూ? అదీ సంగతి. వెంకటయ్యగాడు కటాక్షించిన వాతలు మానడానికి వీ(రాజుకి ఆరునెల్లు పట్టింది.

"బాబూ, హనుమానులూ, తేనెపుచ్చుకోవాలి బాబూ. వేపుళ్ళూ, పప్పులూ మానాలి, ఎవరేనాసరే! పాపం, ఇప్పటికీ వీ(రాజుకి పెళ్ళి కాలేదు.

''పిల్లల్ని చూడ్డాని కెళ్ళడం, పిల్లలు యితగాణ్ణి చూసి 'చేరు' మనడం, బేజారెత్తడం. మా రాంవయ్యకాపు కొడుకుని చూసి, మతి చెలించినవాళ్ళూ, మంచంపట్టినవాళ్ళూ కన్నెపిల్లలు వున్నారంటారు.

''అవి వెధవ కిట్టనివాళ్ళమాటల్లే! బళ్ళో మేష్టరు పొరపాటున బోర్డనుకుని అతనిమీద అంకెలు వేశాడనీ, పొలంలో అతన్ని కూచో పెడితే పిట్టలూ గిట్టలూ అవీ గింజలకోసం రావనీ, ఎవరింట్లోనేనా ధాన్యం అవీ దంచడానికి గొయ్యి కావలసివస్తే వీ(రాజుని తీసికెళ్ళి కూచో బెట్టి లేవదీస్తే గొయ్యి పడుతుందనీ, వాళ్ళింట్లో సాంవాను గదులూ గాదులూ ఒక వైపున్నూ వీ(రాజు గది ఒకవైపున్నూ కొంప ఒరిగి పోకండా యేర్పాటుచేశారనిన్నీ, ఎవరేనా వెంకె పిల్లలుంటే, "వీ(రాజు

వొస్తున్నాడు. వీర్రాజుతో చెప్తాం" అని హడలెత్తించి పారేస్తారనీ నానా కుళ్ళుకూతలూ కూస్తారు గానీ లోపలకిట్టక—నేను నమ్మను.

"హనుమాన్లూ, పెళ్ళయిందా బాబూ నీకు? పాపం, ఆ యిల్లా లెవరో? నీకయినప్పుడు వీర్రాజుకీ అవుతుంది. కాకేంజేస్తుంది? పిండి కొద్ది రొట్టి. ఎవళ్ళకి తగినవాళ్ళు వాళ్ళకు వొస్తారు. భోజుడులాంటి రాజుంటే, కాళిదాసులాంటి కవి వొస్తాడన్నారు. శ్రీరాముడులాంటి ప్రభువుంటే, ఆంజనేయుల్లాంటి బంటువుంటాడు. ఇంతకీ శెరీరం పెంచడం మాత్రం తక్కువపనా, హనుమాన్లూ? అందరికీ సాధ్యఁవా? ఏఁవిరా నానిగా, నువ్వు పెంచగలవురా? ఎంచక్కా ఒక మనిషిని చెరిపి చేయిస్తే మరి నాలుగు మూర్తులు తయారవద్దూ; హనుమానులూ!"

ఇక్కడికొచ్చేసరికి "ప్పి ప్పి ప్పి" అని నవ్వాపుకోలేక గిలగిల లాడుతున్న వాళ్ళందరూ గొల్లుమన్నారు ఒక్కసారి.

"బాబూ, నువ్వూ నవ్వుతున్నావా, హనుమానులూ! ఎలాగ చెప్పుకున్నాను చెప్పుకో?"

"బస్సు అంతా కదిలిపోతుంటే, తెలీదు నాయనా నువ్వు నవ్వు తున్నావనీ?"

షావుకారు అవ్వ గొంతు పిసకలేక, తాను బస్సుమీదనించి దూక లేక ఎలాగున్నాడో ఆ నరకంలో అంతసేపూ, ఇంతలో రైలు స్టేషను దగ్గరకి బస్సువొచ్చి ఆగింది. షావుకారు గభీలుమని లేచి అవ్వకేసి

గుడ్లురుముతూ చూశాడు. అవ్వ కొంటిగా, షావుకారుకి ''ఉంటాను బాబూ, సెలవ్ హనుమానులూ'' అని గుడ్‌మార్నింగ్ లాగా పెట్టింది. అందరూ గొల్లుమన్నారు మళ్ళీ.






ఒకప్పుడనిపిస్తుంది, ఈ లోకంలో అందరూ సత్యవాదులే అని.

"ఎందుకండీ పాడబద్ధాలు మాట్లాడతాడు, అబద్ధాలు ! నా కబద్ధమంటే వొళ్ళు మండిపోతుంది. నిజమనుకున్నది అనేసెయ్యాలి. అనేసింది అమల్లో పెట్టాలి. అంతేకాని నకిలీమాటలూ, నకిలీపనులూ చూస్తే నాకు మహా మంటెత్తుకొస్తుంది. నేను చస్తే అబద్ధమాడను తెలుసునా, నాలిక కోసెయ్యాలికాని" అన్నమాటలు ప్రతినోటా వినబడుతుంటాయి. ఈ లెక్కనిచూస్తే మనకు అడుగడుక్కీ హరిశ్చంద్రులూ, ధర్మరాజులూ తగుల్తారు. కాని ఏనలుగురైదుగురినో తప్పిస్తే, తెలిసో తెలియకుండానో,

ప్రతివ్యక్తికి హమేషా అసత్యదోషం అంటుకుంటూనే ఉంటుంది - మాటలోనో, చూపులోనో, చేతలోనో, నవ్వులోనో !

అయితే ఆ మనిషి అసత్యాన్ని తిట్టినప్పుడుమాత్రం నిజాయితిగానే తిడతాడు. కథ చదువుతున్నప్పుడో, సినిమా చూస్తున్నప్పుడో, దొంగకి కూడా దొంగ పట్టుబడాలనే ఉంటుంది. మనిషిలో లోపలఉన్న మంచినతం అదే. అదే మనిషిని రక్షిస్తుంది. అదే మనిషిచేత ఇందాకటి మాటలనిపిస్తుంది.

ఇంకోటికూడా ఉంది. ఆదేపనిగా ఇంకోడు చెడ్డవాడు అని మొదట కోపంకొద్దీ మొదలెట్టి, అని, తర్వాత అది తానే నిజం క్రింద నమ్మేయడం. అలాగే తానన్నదీ, చేసిందీ, నిజాయితీదీ అని, అనిఅనీ, ఆదీ నమ్మేయడం.

ఏదో పుస్తకంలో చదివినట్టు జ్ఞాపకం. ఒకడు ఒక పెద్ద గండం దాటితే ఏదో చేస్తానని భగవంతుడికి మొక్కుకుని, అది దాటగానే బయలికేసి చూసి, కన్నుగీటి, ఆ మొక్కు చెల్లించడు దేవుణ్ణే టోపీవేసినట్టు! కాని, క్రమక్రమంగా తాను నిజాయితీవాణ్ణే అని నమ్ముతాడు.

ఏదెలాఉన్నా, ఎవడికివాడు అందమైనవాణ్ణనీ, తెలివైనవాణ్ణనీ, నిజాయితీఅయినవాణ్ణనీ, అనుకుంటే తప్ప బ్రతకనేలేడు. దీనివల్ల ఒకటి తేల్తుంది. మంచీ చెడ్డా, సత్యం అసత్యం, ఏవో పాళ్ళల్లో అందరిలో ఉంటాయనిన్నీ, గుణదోషాలు నిర్ణయించేవాడు దయాళువైన ఆ భగవంతుడేననిన్నీ, ఆ భగవంతుడి దృష్టిలో దోషం అనేది కుదర్చవలసిన

రోగమేకాని, దండించవలసిన నేరం కాదనీ, కనక అందరం అన్యోన్యం ఇష్టంగా ఉండాలని.

ఇక ఈ అసత్యాలు చెప్పేవాళ్లు స్థూలంగా మూడురకాలని అనుకోవచ్చు. మొదటిరకం, ప్రతి నిత్యం దినచర్యలో తగిలే బాపతు. "బడికెందుకు రాలేదురా నిన్న?'' అని మేష్టరడిగినప్పుడల్లా, బ్రతికున్న అమ్మమ్మ నిన్న చచ్చిపోయిందని చెప్పే పిల్లవాడిలాగ. ఇలాంటివి అధికారుల దగ్గర, ఆఫీసులలో, బేరసారాల్లో, ఇచ్చిపుచ్చుకోడాల్లో, అన్నిట్లో హెచ్చుతగ్గు పాళ్లల్లో రోజూ తగుల్తూంటాయి. వీటిలో అంత సరదా కన బడదు. అయినా ఒక పిల్లవాడు, మేష్టరుతో చెప్పిన అసత్యం చమత్కారంగా ఉంటుంది. "ఏమిరా ఎందుకు ఆలస్యంగా వచ్చావు? '' అంటే '' వాన కురుస్తోంది కాదండీ. ఒక అడుగు ముందుకేస్తే, రెండడుగులు వెనక్కు జారుతుంది. అందుకని ఆలస్యమయిందండి. "

'' అడుక్కి రెండడుగులు అలా వెనక్కిజారితే, స్కూలు కెలా రాగలిగావురా ? ''

" వీపు స్కూలువైపు పెట్టాను మేష్టారూ. ''

ఇంకోరకం అసత్యంవాళ్లున్నారు. వీళ్ల రామాయణంలో రజకుని వారసులు. వీళ్ల తేళ్ళకి తాతలు, తోదేళ్ళకి తండ్రులు. వీళ్ళు మహా అపత్కారమైనవాళ్ళు. వీళ్ళు ఒథెల్లో నాటకంలో ఇయాగోకి చుట్టాలు. మన శకునీగికునీ వీళ్ళకి కాస్త దగ్గరగా వస్తారేమో! వీళ్ళకి పెద్దా చిన్నా

మంచీ చెడ్డా, స్త్రీ పురుషుడు, న్యాయం అన్యాయం అంటూ ఉండదు. వీళ్ళు మొట్టమొదట భయంకరమైన అసత్యం ఆడి, తర్వాత దానిని నిలబెట్టడానికి కారణం వెతుక్కుంటారు. " Motive hunting of a motiveless malignity " లాగ. ఈ దిక్కుమాలిన అసత్యం ఆ నోటా ఈ నోటా దొర్లి దొర్లీ, నాని నానీ, చాలా పెద్దగా వికృతంగా చుప్పనాతిగా తయారవుతుంది.

మూడోరకం వాళ్ళున్నారు. చీమకైనా చెడ్డ చేయలేరు. కాని వీళ్ళకి కాశీమజిలీ కథలు కంఠస్థం. వీళ్ళ కల్పనకి కళ్ళెం అంటూ ఉండదు. పక్క వీధిలో కొకసారి ఇట్టే వెళ్ళొచ్చి పదితలల రావణాసురుణ్ణి అప్పుడే చూసివచ్చామంటారు. కీలుగుర్రాలూ, ఎగిరే తివాసులూ, ఇలాంటి వాటికల్లా వీళ్ళ మెదడే పుట్టిల్లు. అయినా మంచివాళ్ళు, కులాసావాళ్ళు. ఇదిగో వీళ్ళనిగురించి చెపుతూంటేనే ఇద్దరొస్తున్నారు. కాస్త పక్కకి తప్పుకుని వాళ్ళమాటలు విందాం.

* * * *

హరిశ్చంద్రుడు

యేఁవి చలి! యేఁవి చలి, ధర్మరాజా! మనం పురాణాల్లో చదివింది అబద్ధమనుకుంటాం కాని వెట్టిపీరులం ...

ధర్మరాజు

అదేదో ముందు చెపుదూ, చెంద్రం.

హరిశ్చంద్రుడు

ఆగు, యిలా చూడు, ముందీమాట విను. నడివీధిలో చెంద్రం అని నన్ను ఎప్పుడూ పిలవకేం? నిన్ను రాజు అంటున్నానా, ధర్మరాజు అని పిలుస్తున్నానా? నన్ను సత్యహరిచ్చెంద్రం అను, పోనీ హరిచ్చెంద్రం అను.

ధర్మరాజు

సరే హరిచ్చెంద్రం, జరిగిందేఁవిటో చెప్పదూ.

హరిశ్చంద్రుడు

బదరీనాథ్, హరిద్వారం యాత్రలన్నీ పూర్తిచేశాం. నేను మానససరోవరానిక్కూడా బయలుదేరా. అదీ దాటాను. గడ్డు హిమాలయాల మధ్య కొచ్చాను.

ధర్మరాజు

ఒక్కడివే?

హరిశ్చంద్రుడు

నాతో మరొహడు వస్తున్నాడుగా. ఒకచోటు కొచ్చాక, ఒకనాడు వాడితో యేఁవిటో చెబ్దామనుకున్నాను. ధర్మరాజూ, మాటలు - మన నోటమ్మట వొచ్చే మాటలోయ్ - అవి చలికి గడ్డకట్టుకుపోయి, యివతలికి పడి రాలడం మొదలెట్టాయి. ఇహచూడూ, వాడి వాక్కులు వడగళ్ళు. మన మాటలు మంచుగడ్డలూను. యిక మాట్టాడుకోవడఁవెలాగోయ్?

ధర్మరాజు

యిప్పటికీ అలాగే వుందన్నమాట చలక్కడ ?

హరిశ్చంద్రుడు

యేం, నువ్వూ వెళ్ళావా ధర్మరాజూ?

ధర్మరాజు

నేను టిబెట్టు కూడా చుట్టబెట్టాను కదోయ్, హరిచ్చెంద్రం! అయితే మేం ముందు జాగర్తలో పడ్డాం. నువ్వు చెప్పినట్లే మాట్లాడు కుంటూంటే, మాటలు ముక్కలుముక్కలుగా గడ్డకట్టుకుపోయి రాలి పడేవి. అప్పుడు మేము అగ్గిపుల్లలు వెలిగించి, వాటిని మాటలుగా మార్చేసి తంటాలుపడేవాళ్ళం.

హరిశ్చంద్రుడు

నాకూ తోచిందనుకో ఆ వుపాయం. కాని యీ యేడు చలి యెలా వుందంటే, ఆ అగ్గిపుల్ల వెలిగించేసరికి, ఆ వెలుగు గడ్డ కట్టుక పోయి, నక్షత్రంరాలి పడ్డట్టు చుంయిమని రాలిపడిపోయేది. సరే దానికేంలే.

ధర్మరాజు

ఆఁ! అలాగేం ?

హరిశ్చంద్రుడు

తిరిగొచ్చేటప్పుడో గమ్మత్తు. వొక కొండలబారు దగ్గర ప్రతిధ్వని. 'సత్యహరిచ్చెంద్రా' అని యిప్పుడు కేకేస్తే, మరి పది నిమిషాలయాక ఘట్టిగా స్పష్టంగా 'సత్యహరిచ్చెంద్రా' అని ప్రతిధ్వని తిరిగొచ్చేసేది.

ధర్మరాజు

అంటే, నువ్వు టిబెట్టు వెళ్ళలేదుగా మరీ. దాన్నే మన వాళ్ళు 'త్రివిష్టపం' అంటారు. 'సురలోకోద్యోదివౌద్వౌ స్త్రియాం క్లీబే త్రివిష్టపమ్' అన్నాడు కాదుటోయ్ అమరంలో. అక్కడ అంతా దేవతల లెక్క. వోచోట వోరాత్రి ఆగిపోవలసి వొచ్చింది, పది ఘంటలకు. ఇహ నిద్రపోవాలి. అయితే, తెల్లారగట్ట ఆరు ఘంటలు దాటకుండా లేవాలి. అప్పుడేం చేశానూ, 'ధర్మరాజా తెల్లారింది లేలే!' అని కేకేసి పడుకున్నా. మరి ఎనిమిది ఘంటలయాక, అంటే తెల్లవారగట్ట, సరిగ్గా ఆరుఘంటలకి 'ధర్మరాజా! తెల్లారింది లేలే!' అని అలారంలాగ కొండ కొండనుంచి, నా కేకే ప్రతిధ్వని వొచ్చి లేపేసింది. యిదంతా ఎందుగ్గాని, హరిచ్చెంద్రా, చలికాలంలో వుత్తరదేశయాత్ర చేయకూడదూ అంటాను.

హరిశ్చంద్రుడు

వేసంగిలో మాత్రం? యిది విను. వోమాటు వో పెద్ద వుద్యోగి - పేరెందుకులే - ఢిల్లీనుంచి "సత్యహరిచ్చెంద్రం! నీతో ఏదో ఆలోచించాలి, వెంటనే రా, ప్లీజ్" అని ఫోనులో మాట్లాడాడు. మండు వేసంగి! ఏంజెయ్యను? చచ్చినట్టు బయలుదేరా. మకాం ఆయనగారి భవంతిలోనే. అంతా పాలరాయి! వొకనాడు మా మంతనాలయ్యాక, ఆ పాలరాతి వరండాలో పచారుచేస్తూ చుట్ట వెలిగించాను. చుట్ట కాల్చు కుంటుంటే ఉమ్మిరాదు మరీ? ఉమ్మేశా. చటుక్కున గ్యాపక(వొచ్చింది.

ధర్మరాజు

యాఁవనీ?

హరిశ్చంద్రుడు

అది పెద్ద ఉద్యోగి భవనమనీ, పాలరాతిదనీ. యెక్కడబడితే అక్కడ ఉమ్మెయ్యకూడదనీ.

ధర్మరాజు

యెవరిదైతే నీ కద్దేఁవిటోయ్? నీకు రూల్సేఁవిటి హరిచ్చెంద్రం!

హరిశ్చంద్రుడు

అవున్లే! అయితే మనకే బావుండదు చూడూ. అప్పుడు చప్రాసీని పిలిచాను. 'ఉమ్మిపడ్డచోట శుభ్రంగా కడిగేవోయ్' అన్నా. 'యెక్కడ?' అన్నాడు వాడు. నేలకేసి చూస్తే యేఁవీలేదు.

ధర్మరాజు

యేం జరిగింది?

హరిశ్చంద్రుడు

ఉమ్మి ఆనవాలైనా లేందే. కింద ఆనవాలు వుండటానికి అది నేలమీద పడితేనా?

ధర్మరాజు

అవును మరి, మందు వేసంగాయెనూ. ఆ నిష్ఠీవనం నోటి నుంచి నిష్క్రమించీ నిష్క్రమించడంలో భూమిని చేరకండానే ఆవిరై

పోయి, మేఘశకలాలకు మల్లే చెదిరిపోయిందన్నమాట. నాకూ అంతే జరిగిందిగా ఒకసారి రాజపుటానాలో. నేను నీళ్ళు పుక్కిలించి వుమ్మేయడం, నోట్లోంచి నీళ్ళురాకండా ఆవిరిలా రావడం, అంతే. ఒక ఫాక్టరీగొట్టాంలాగా అయిపోయానోయ్ !

హరిశ్చంద్రుడు

నీకు వుమ్మేయడం దాకానన్నా వొచ్చింది. వోసారి మన బెజవాడలో బకింగ్‌హామ్‌పేటలో భానుమూర్తిగారి భార్య, నాకు మంచి నీళ్ళు యివ్వబోవడం, ఆ చెంబు నా కందించేలోగా అది ఉత్తదిగా అయి పోవడం ! అయితే యివన్నీగూడా ప్రకృతిలో వున్నవే. ఆ భగవంతుడి చేతలు. తపస్సువల్ల మనుష్యులమే బ్రహ్మాండమైన శక్తిని సంపాదించవొచ్చు.

ధర్మరాజు

అంత తపస్సు లేకపోయినా, మనలాంటివాళ్ళం కూడా కొంత ధీమాతో, పట్టుదలతో, అసాధ్యపుపనులు చేయొచ్చు. వోసారి, మా జమీందారుగారితో వేటకెళ్ళా. ఆయన, ఈ ధర్మరాజుగాడు లేకండా, కోటనుండి వొక్క ఘడియ యివతలకు అడుగుపెట్టేవాడు కాదు. సరే వేటకు వెళ్ళాం. కీకారణ్యం. ముందు నేను నడుస్తున్నా. వెనకాల చీమల బారులా మిగిలినవాళ్ళు, వేటకుక్కలు, సరంజాము! మాబారులో ఆఖరి వాడికి కొంచెం అవిటికాలు. నువ్వెరుగున్నదేకదా, నాకు మాటా నడకా అన్నీచురుకే. హఠాత్తుగా వున్నట్టుండి, వెనకనుంచి 'మొర్రో పులి పులి!'

అని కేక వినపడింది. మా జనమంతా యధాయధలై పోయి, చెట్టూ పుట్టా చూసుకున్నారు. ఆ అవిటికాలువాణ్ణి, యెలకను పట్టుకున్నట్టు వొక పులి నోట కరుచుకుంది.

హరిశ్చంద్రుడు

యేం జేశావప్పుడు ?

ధర్మరాజు

యెంతైనా మనిషినికదా, యేం జేస్తాను ? వాణ్ణి వదిలిపోతానా ? వొక్క అంగలోవెళ్ళి, మొదట దాన్ని అడ్డగించాను. "ఆగు" అన్నాను. కాస్తా కూస్తా వుందా పులి ? దాని వంటిమీద చారలే ఉన్నాయి, నాలుగేసి అడుగుల వెడల్పు !

హరిశ్చంద్రుడు

సొట్టాడ్ని వదిలేసిందా అది ?

ధర్మరాజు

వదుల్తుందీ ? ఆ పెట్టేవి పెట్టకండా వదుల్తుందా ?

హరిశ్చంద్రుడు

యేం జేశావ్ ?

ధర్మరాజు

దండం దశగుణం భవేత్ ...... చేతిలోవున్న బడితెతో వో పెట్టు పెట్టాను ఆ వ్యాఘ్రచక్రవర్తికి. కపాలమోక్షమయినంత పనయింది.

నేను యే సింహాన్నో, శరభాన్నో, గండభేరుండాన్నో అనుకుంది. వాణ్ణి వదిలి కుయ్యో, మొఱ్ఱో అని వొకటే పరుగు.

హరిశ్చంద్రుడు

బతికాడా ?

ధర్మరాజు

చచ్చిపోనిస్తానటోయ్ ! అయితే మెడమీద పేద్ధగాయం. బతుకుతాడని అనుకున్నానా ? వోపని చేశాను. నాకు తెలుసున్న నాలుగు ఆకులున్నాయి అక్కడ. అవితెచ్చి, ఆ పసరు ఆ గాయంపైన పిండాను. ఓ ఘడియలో చర్మ(వంతా, నున్నగా మామూలుగా అయిపోయింది. ...... చెప్పొచ్చిందేమంటే మనకు ఆ నిబ్బరం వుండాలి. పులవనీ, దాని బాబో తాతో అవనీ, తోక ఝాడింపవలసిందే.

హరిశ్చంద్రుడు

కాని ఇదొకప్పుడు మనకీ వికటించవచ్చు. మనం ఆ పులితో కాళ్ళా వేళ్ళా పెనగవలసి రావచ్చు. మనకి నాలుగు చావుదెబ్బలు తగలొచ్చు. తపస్సేవుంటే ! మా తాతగారికిలాగ ! తాతగారంటే మా అమ్మగారి తండ్రిలే.

ధర్మరాజు

అలాగా ?

హరిశ్చంద్రుడు

అవును. ఆరోజుల్లో వోసారి శ్రీశైలం వెళ్లుతుంటే ఆయన, హఠాత్తుగా పెద్దపులి బొబ్బలు వినిపించాయట. ముందు అందరూ చెల్లా

చెదరై పొయ్యారు. యెందుకర్రా అంత కంగారు అని మా తాత కేకేస్తూనే వున్నాడు. వాళ్లు దూరంగాపోయి, శాస్త్రుర్లుగారూ, మీరూ ప్రాణాలు దక్కించుకోండి, రండి, అని కేకలుపెట్టారు. మా తాత వో చిరునవ్వు నవ్వి, "మీకు మల్లే నాకు పిక్కల్లోకాదు వుంట బలం" అని అంటూ, ఆ శార్దూలంవైపు తీక్షణంగా చూడ్డం మొదలుపెట్టాడు, దాని కళ్లల్లో కళ్ళుకలిపి.

ధర్మరాజు

అది మీదపడకండా అలా నిలబడి వుందిటోయ్ మీ తాత చూపుతో!

హరిశ్చంద్రుడు

నిలబడిందనా అంటున్నావు! యెలా నిలబడుతుంది? మా తాతగారి చూపుల్లోని విద్యుచ్ఛక్తి చింతనిప్పులవంటి దాని కళ్ళల్లోకి ప్రసరించడవున్నూ, దానికి షాకు కొట్టినట్టు అయిపోవడవున్నూ, అది గాలి తీసేసిన రబ్బరుబొమ్మలాగ చప్పగజారి నేలమీద బట్బోవడవున్నూ జరిగాయి; నువ్వు నమ్ముతావో, నమ్మవోగాని!

ధర్మరాజు

నువ్వు చెప్తుంటే యెందుకు నమ్మను? యింతకూ మన పెద్దల తపశ్శక్తి అలాంటిది! వోసారి మా పెత్తండ్రిగారు – నువ్వు ఎరుగుదువుగా ఆయన్ని, మహానుభావుడు – ఆయనాన్నూ, మా వూరు రాజాగారున్నూ బావా అంటే బావా అని పిలుచుకొనేవారు ... వో మారు యిద్దరూ వూరిబయటకు రాజాగారి బగ్గీలో షికారు వెళ్లుతున్నారు. రాజా

గారు సరదాకి - బావమరదుల వరసకదూ మరి - మా పెత్తండ్రిగారివైపు చూసి, "యిదిగో యీ కనబడే భూమంతా మీరు రేపటికి తెల్లవారేసరికి, యెన్ని యెకరాలమేర దున్నుకోగలిగితే అన్ని యెకరాలూ మీకిచ్చేస్తున్నాను" అన్నారు, వెటకారంగా నవ్వుతూ, పక్కనున్న దివానుకేసి కన్నుగీటి. మా పెదనాన్న "చిత్తం'' అన్నారు గంభీరంగా. చీకటి పడుతోంది. యింటి కొచ్చేశారు. యింటికిరాగానే, మా పెదనాన్న "వొరే అబ్బాయ్, రాగిచెంబూ దర్భాసనం పట్టుకు నాతోరా'' అన్నాడు. యిద్దరం రాజుగారు చూపించిన స్థలం దగ్గరకి వెళ్ళాం. ముక్కా, మోడిగా, రాయీ, రప్పా, యెగుడూ, దిగుడూ, భయంకరంగా వుంది మైళ్ళకొద్దీ.

హరిశ్చంద్రుడు

అప్పుడేం జరిగింది ?

ధర్మరాజు

దర్భాసనం వేసుకున్నారు మా పెదనాన్న. దానిమీద పద్మాసనం వేసుకున్నారు. పక్కన నీళ్ళతోవున్న రాగిచెంబు పెట్టుకున్నారు. కళ్ళుమూసుకుని యేవో మంత్రాలు జపించడం మొదలుపెట్టారు. నేను కుర్రాణ్ణికదా, నెమ్మదిగా ఆ ప్రక్కన వొరిగి నిద్రపోయాను. తరవాత పెదనాన్నగారి గొంతుక వినబడింది, "అబ్బాయీ" అని పిలిచినట్టు. లేచి చూశాను. తెల్లారింది. కంటికి కనబడేటంతమేర యే వెయ్యి యెకరాలో

యెంతో నున్నగా. చదునుగా నూరేళ్ళనుంచి దున్నుతున్న మాగాణిలా అయిపోయింది.

హరిశ్చంద్రుడు

యెలా అయిందంటావు ?

ధర్మరాజు

ఆ రాత్రి మేం కూచున్నచోట - అది పెద్ద శ్మశానం - మా పెత్తండ్రిగారు మంత్రాలు చదివి, భూమిలోనుంచి చచ్చిపోయినవాళ్ళ దెయ్యాలనన్నింటిని పిలిచారు. వాటితో, మీరు తెల్లవారేలోగా యెంత దున్నగలరో అంతవరకు దున్నండి, అని ఆర్డరు చేశాడు. అవి వెయ్యో పదిహేనువందలో యెకరాలు దున్నేశాయి, చచ్చినట్టు! తెల్లారేసరికి మాయమయ్యాయి. మంత్రబలం!

హరిశ్చంద్రుడు

అప్పుడు రాజుగారు యేంజేశారు ?

ధర్మరాజు

మా పెదనాన్న నన్ను పంపాడు వారిని పిలవమని. వారు వచ్చారు. అంతా చూశారు. తెల్లమొహం వేశారు. "కలయో వైష్ణవ మాయయో" అన్న పద్యం పాడ్డానికి సిద్ధమయ్యారు. "అదేదీ కాదు మహాప్రభూ, అస్మదాదుల తపశ్శక్తి" అన్నారు మా పెదనాన్నగారు. అప్పుడు "ఈ భూమంతా మీరు తీసుకుంటే మాకు మిగిలేది యేమిటండీ"

అని అన్నారు రాజాగారు. అప్పుడు మా పెత్తండ్రిగారు, "మడి మాన్యాలపై మమకారంగలవారికి గాని మా కెందుకండీ యీ భూమి? కావాలంటే కల్పవృక్షం నాటెయ్యనా మా దొడ్లో?'' అనీ, అయితే మీ మనస్సు నొవ్వకండా, ఒక పందుంభూమి తీసుకుంటాంలెండి, అని రాజాగార్ని వూర్కోబెట్టారు. ఆయనే ఆ రోజుల్లో - సీమదొర, గవర్నరు - ఆ గవర్నరుకు ప్రాణరక్షణ చేశాడు. చేస్తే "మిస్టర్ ధర్మరాజ్, థాంక్యు వెరిమచ్'' అని షేక్‌హాండ్ చేసి పారేశారు.

హరిశ్చంద్రుడు

మర్చిపోయి నీపేరు పెట్టావేమిటి మీ పెద్దనాన్నగారికి యిందులో పొరపాటున?

ధర్మరాజు

హఠాత్తుగా నిద్రలోలేపి పలకరించినా మన కసత్యంరాదు. మా పెదనాన్నగారి పేరు నాకు పెట్టారు ... ఆ గవర్నరు కథేఁవిటంటే ...

* * * *

చూశారా వాళ్ళధోరణి. రండీ ఇకచాలు, మనం వెడదాం. వాళ్ళని మనం నమ్మం, వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళూ నమ్మరు. కాని వాళ్ళవల్ల ఎవళ్ళకీ చిక్కులేదు. వాళ్ళతో కూచుంటే మనకు ఊసుపోతుంది. ఎప్పుడేనా చిక్కొస్తేమాత్రం వాళ్ళకే వస్తుంది, తొడేలు గొల్లపిల్లవాడు కథలోలాగ.

ఎప్పుడు వాళ్ళని నమ్మాలో తెలియదు కాదూ మరి? మొత్తంమీద అసత్యం తోడేలు.

ఒకాయన వైద్యం చేస్తాడు. మహా గట్టివాడు. అతని మందు జబ్బు కుదర్చడంలో ఎంత అమోఘంగా పని చేస్తుందో, అతని సంభాషణలో కథలు రోగికి అంత ఉల్లాసం కలిగించి ఆ మందుకి తోడ్పడుతాయి. అతనితో ఉండి ఆ కథలు వింటూంటే రోగం రాదనిపిస్తుంది. ఎటొచ్చీ వింటూన్నప్పుడు, మనం నమ్మ నట్టుగానీ, నవ్వుతూన్నట్టుగానీ మొహం పెట్టకూడదు. ఇందాకా విన్న సంభాషణలో పదిహేను వందల ఎకరాల రాతినేల ఒకరాత్రికి రాత్రి దయ్యాలు చదునుచేసి మాగాణిగామార్చిన కథ ఆ భిషగ్వరప్రోక్తమే. అంటే వారు సెలవిచ్చిందే. వేసవికాలపు ఎండకథలు కూడా ఆయనవే. ఆయన్ని మించినవాడున్నా డొకాయన. పులిమీద పుట్ర. యుద్ధం రోజుల్లో ఆయన చెప్పేవాడూ: హిట్లర్ కి మూడు రహస్యాయుధాలున్నాయనిన్నీ, అందులో ఒకటి తనకున్నూ తెలుసుననిన్నీ, అది "ధాం" అని నడుచుకుపోతూ అన్నిటినీ పిండిచేసేకొండ అనిన్నీ, పర్వతాల రెక్కలు ఇంద్రుడు నరి కేస్తున్నప్పుడు ఎక్కడో దాక్కుని దాటుకువచ్చిన పాపతనిన్నీ.

ఓ చిన్నకథ ఆయన చెప్పింది :

"దిష్టిబొమ్మలు కట్టరండీ పొలాల్లో, కాకులూ అవీ వాలి ధాన్యపు గింజ లెత్తుకపోకుండా. వొకసారి ఆ దిష్టిబొమ్మకుకూడా కాకులు లొంగక పోతే, వో రాత్రికి రాత్రి జపంచేసి మంత్రించి వో బొమ్మను కట్టాను.

అది కట్టాక హడలిపోయి కాకులు అదివరకు కరుచుకుపోయిన గింజ లన్నీ పట్టుకొచ్చి అంతదూరాన్ని గట్టులాగపోసి చక్కాపోయాయి.''

ఏదో ఇందాకటివాళ్ళకి. హరిశ్చంద్రుడనీ. ధర్మరాజనీ పేర్లు పెట్టాం. పెడితేయేం ? మనం అందరమూ దేవుళ్ళవీ మహాత్ములవీ పేర్లు పెట్టుకోవడంలేదూ ?



